

"పందెం"

జానపద రేఖాచిత్రం

చిత్రకారుడు: వెల్లటూరి పూర్ణానందశర్మ

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.



సచిత్రవారపత్రిక
Founder : K. NAGESWARA RAO

సంపుటము 48
సంచిక 34
4-5-55

మన్మథ వైశాఖ శుద్ధ త్రయోదశి బుధవారం

మరియమ్మన్ తెప్పాకులం (మధుర) మంటపం

(ఈ చిత్రము, 28వ పేజీలోని మధురమీనాక్షి దేవాలయ గోపురం, 29వ పేజీలోని తిరుమలనాయకుని మహల్ అంతర్భాగం చిత్రాలూ, 28, 31 పేజీలలోని చిత్రాలూ పంపినవారు కె. గురుమూర్తి, మద్రాసు.

# విషయానుక్రమణిక

ముఖచిత్రం :
హిందీనటి 'శ్యామ'

## కాంబోడియా కబుర్లు 12:

# రాజుగారి పుట్టినరోజు

క్రొవ్విడి లక్ష్మన్న

రాజుగారిపుట్టినరోజు పండుగ సాధారణంగా అయిదురోజులు జరుగుతుంది. అయితే, రాజుగారు పుట్టినసంవత్సరానికి ఏజంతువు అధిపతో, ఆ జంతువు తాలూకు వర్షపంచకంలో, యీ పుట్టినదినపు పండుగ వారంరోజులు జరుపుతారు. (అరవై సంవత్సరాలు పన్నెండుభాగాలుచేసి, ఒక్కొక్క భాగానికి చెందిన అయిదువీళ్ళకీ ఒక్కొక్క జంతువు అధిపతి అని లొగడ రాసేను) ఈ అయిదురోజుల్లోనూ నాలుగోనాడు రాజుగారు పుట్టినతిథితో సరిపోతుంది చాంద్రమానంప్రకారంన్నా. ఈపుట్టినదినపుపండుగ రాజుగారు దీర్ఘాయుష్మంతులు కావాలనీ, అలా మఠాధిపతులూ, బుద్ధత్రయం ఆశీర్వదించాలనిన్నీ వాడుకలోకి వొచ్చింది

ఈవేడుక అన్నాళ్ళూ దివానూ, యితర బొక్కసపు అధికారులూ కలిసి, రాజుగారి ఆభరణాదులన్నీ "ఎగ్జిబిషన్" పెడతారు. ఈ "ఎగ్జిబిషను" కోటలోనే ఓ భాగంలో పెడతారు. సిహనోక్ ప్రభువుకాలంనుంచీ, ఆభరణాదులేకాక, దేశంలో గల చిత్రవిచిత్ర వస్తుసముదాయంఅంతాకూడా "ఎగ్జిబిషన్"లో పెట్టడం ఆచారం అయింది. అంతేకాకుండా సాయంకాలం చీకటిపడ్డాక కోట ఆవరణప్రాంతాల్లోగాని, నది ఒడ్డునగాని రంగురంగులవీ, తమాషా అయినవీ ఎన్నోరకాలు పటాకీలు కాల్చడంకూడా అనవాయితు!

తొలినాటి సాయంకాలం సింహాసనమూ అదీ ఉన్న కొలువుకూటంలో ప్రభువులు "విజయదీపిక (*Le Cierge de la Victore*) వెలిగిస్తారు. తేనెపట్టు కొవ్వుతో చేసిన యీ దీపం పదిహేనుపౌన్లు బరువూ, మూడడుగులుపొడుగూ ఉంటుంది. మట్టు డయామీటరు పది సెంటిమీటర్లు. ఈ లెఖ్ఖలూ తూకాలూ అన్నీ సరిగ్గా సరిపోతేనేగాని ఆదీపం యీ పుణ్యసమయానికి పనికిరాదు!

దీన్ని ఓ చిన్న వెదురుబొంగు మట్టుమీద నిలబెట్టి, ఆపాళంగా దాన్ని ఓ చిన్న పాలవెల్లిలాంటిదాన్లో పెడతారు. ఈ పాలవెల్లి ముందు సుఖాసీనుడయి, బౌద్ధస్వాములవారు రాజుగారికోసం నిరీక్షిస్తూ ఉంటాడు. తరవాత ప్రభువులూ, ఆయనవెంట చక్కగా అలంకరించిన గిన్నెలో కొవ్వొత్తి పెట్టి పట్టుకుని పరిచారకుడూ ప్రవేశిస్తారు. ఆ తరవాత స్వాములవారు "విజయదీపిక" వెలిగించి బుద్ధ భగవానుడి కృపాకటాక్షాలు రాజుగారియందు కలగవలసిందిగా ప్రార్థిస్తాడు. (ఈ విజయదీపికతోనే యింకో పెట్రోలు లాంతరు కూడా వెలిగిస్తారు; ఓవేళ ఏ కారణంచేతనయినా యీ దీపిక అయిపోయినా, ఆరిపోయినా రెండోది అలా వెలుగుతూ ఉండడానికి!) అఖండ దీపంలాగ యిది వెలుగుతూన్న అయిదు రోజులూ రాజుగారు కోట దాటి బైటికి వెళ్ళడానికి వీల్లేదు. ప్రార్థనలూ, బుద్ధప్రవచనపఠనమూ అయింతరవాత, కోటలో ఉద్యోగులంతా అక్కడున్న చిన్నచిన్న దీపాలు వెలిగిస్తారు.

మొదటి మూడు రోజులూ ప్రార్థనలూ అవీ జరుగుతాయి. ఈ ప్రార్థనలు చెయ్యవలసిన బుద్ధభిక్షువులకీ ఒక లెఖ్ఖ! రాజుగారికి ఎన్నేళ్ళు ఉంటే అంతమందీ + మరొక్కడూ!! ఈ మొత్తం భిక్షువుల జనాభా మూడు రోజులకీ సర్ది, ఆప్రకారం ప్రార్థనలూ అవీ జరిపిస్తారు ముందునాడు ప్రార్థన జరిపినవాళ్ళందరికీ మర్నాడు ఉదయాన్ని ప్రభువులు విందుచేస్తారు, యీ మూడు రోజులున్నూ.

ఇలాగ్గానే రెండో రోజు ఉదయం, తొలిరోజు భిక్షువులకి సంతర్పణ జరుగుతుంది. ఆ మధ్యాహ్నం మళ్ళీ బుద్ధభిక్షువులు ప్రార్థనలు జరుపుతారు; కాని యీ తంతులో తురకల ప్రార్థనలు కూడా ఉంటాయి, యీ రెండో రోజున! మహమ్మదీయులూ, బుద్ధ భిక్షువులూ కలిసి సింహాసనం చుట్టూ తిరుగుతూ (ప్రదక్షిణంలాగ) ప్రార్థనలు చేస్తారు. * బ్రాహ్మలకీ, బుద్ధభిక్షువులకీ, తురకలకీ అందరికీ కలిపి మర్నాడు విందు!

* కాంబోడియా రాజ్యంలో "షామ్స" (*Chams*) అనే తురకలుకూడా ఉన్నారు. షాంపా ప్రాంతం నాశనం అయిపోయినప్పుడు వీళ్లు కాంబోడియా (ఖ్మేరు) దేశంలో శరణుజొచ్చేరుట!

ఇహ, నాలుగోనాడు - ఆవేళ నిజంగా తిథిప్రకారం రాజుగారి పుట్టినరోజు. ఉగాదినాటికి మల్లేనే ఆవేళ ప్రభువులు పవిత్రోదకస్నానం చేస్తారు. ఇరవైయొక్కసారి ఫిరంగులు పేలుస్తారు, యీ స్నానకర్మ జరుగుతూఉంటేను. ఆ తరవాత ప్రజలూ, విదేశీయులూ వొచ్చి రాజుగారికి తమ శుభాకాంక్షలు తెలుపుకుంటారు.

అయిదోనాడు, రాచకుటుంబంలో వాళ్ళకి, సిల్వర్ పెగోడాలో బుద్ధప్రవచనాలు పురాణశ్రవణం! ఆవేళ సిల్వర్ పెగోడాలో పంచక్షేత్ర విగ్రహాలూ (శివ, ఉమా, నారాయణ, గణేశ, బలరామ విగ్రహాలు), పవిత్ర కరవాలమూ తెచ్చి ఉంచుతారు. వాటికి పక్కగా అయిదు నీటి కలశాలూ, పదహారు చిన్న కలశాలూ ఉంచుతారు. ఎనమండుగురు భటులని తీసుకువచ్చి గోడదగ్గిర రెండువరసల్లో కూచోపెడతారు వీళ్లకి, యిద్దరిచేతుల్లో దండాలూ, నలుగురి చేతుల్లో కత్తులూ, యిద్దరికి తుపాకులున్నూ, కోటలోఉన్న ఉన్నతోద్యోగులు వీళ్లకి ధాతవస్త్రాలు యివ్వాలి తరవాత బ్రాహ్మడు (రాజపురోహితుడు) మంత్రాలు చదువుతాడు. ఆ సింహాసన ప్రాంతానికి అధిపతి అయిన "నక్తా" (స్థల దేవత) సంతోషించి, యిహ ఏ తేడా లేకుండా కాపాడుతుంది, రాజుగార్నీ కోటనిన్నీ! ఆ తరవాత యిద్దరు రాజపురోహితులు, ఒకడు బల్లెం పుచ్చుకునీ, రెండోవాడు కత్తిపుచ్చుకునీ, ముమ్మారు కలశోదకాల్లో ముంచి, ఏవో వికార చేష్టలు చేస్తారు. దాంతో పటాపంచలై పోతుంది!

తరవాత ఒకడు మంత్రాలు చదువుతూ ఉంటే, మిగతావాళ్లు ముక్కా ముక్కా సంత చెప్పినట్టు రెండుసార్లు పునరుచ్చారణ చేస్తారు, - కలశాల్లో ఉన్న పవిత్రోదకాలు తీర్థం పుచ్చుకుంటారు.

ఆ మధ్యాహ్నం యీ మంత్రాలూ అవీ కేవలం కోటలో ఉన్న జనానాకి చదివి వినిపిస్తారు. ఈపూట మిగతా ఉద్యోగస్థుల ఆడవాళ్లుకూడా రావొచ్చునుగాని, మొగపురుగు అన్నవాడు ఉండడానికి వీల్లేదు మరి, ఒక్క పురోహితులు తప్పించి!!

తదుపరి, బౌద్ధస్వాములవారి సమక్షంలో రాజుగురు "విజయదీపిక" ఆర్పేస్తారు. అయితే దీనికి ముందు, యీ దీపంతో యింకో చిన్నదీపం వెలిగించాలి. ఆ చిన్నదీపం, ఆ తరవాత, తమలపాకులు మడిచి పట్టుకుని, ఆ ఆకుల మడతలతో ఆర్పాలి! కాని సాధారణంగా జరిగేది ఏమిటంటే, చిన్నదీపం ఆకుల మడతలతో ఆర్పేసి, పెద్ద దీపం దానంతటదే ఆరిపోయేదాకా ఊరుకుంటారు. (యింకాఉంది)



# ఆత్మహత్య

## 1

ప్రసాదరావు: గుడ్ మార్నింగ్ సార్.

మాధవయ్య: గుడ్ మార్నింగ్. రండి.

ప్రసా: మాధవయ్యగారున్నారాండి?

మాధ: మీ కేం కావాలి?

ప్రసా: మాధవయ్యగారితో మాట్లాడాలి.

గొంతు: ఏమిటో చెప్పండి.

ప్రసా: మీ పేరు...

గొంతు: మాధవయ్యను నేనే! ఏం కావాలి మీకు?

ప్రసా: క్షమించండి. ఇంకా మీరెవరో అనుకున్నాను. నా పేరు ప్రసాదరావండి.

మాధ: కూచోండి. ఇంకా నిలబడే ఉన్నారు.

ప్రసా. ఫరవాలేదులెండి. మాది ఈ ఊరే నండి.

మాధ: ఆఁహాఁ...

ప్రసా: ఎన్నో కథలు, నాటకాలు వ్రాశానండి.

మాధ: అలాగా?

ప్రసా: దాదాపు పదిసంవత్సరాలనుండీ ఈ రంగంలో కృషిచేస్తున్నాను.

మాధ: అట్లాగాండి...

ప్రసా: ఒకటి రెండు పుస్తకాలుగూడా ప్రకటించాను.

మాధ: అయితే నన్నేం చెయ్యమంటా రండీ?

ప్రసా: మొన్న మొన్నటివరకు ఏవో చిల్లరమల్లర ఉద్యోగాలు చేస్తూవచ్చాను.

మాధ: నానుడు పెట్టకుండా త్వరగా తేల్చండి. అవతల నాకు చాలా పనులు న్నాయి.

ప్రసా: మరేమీలేదు. ప్రస్తుతం నేను ఎంతో ఇబ్బందిపడుతున్నాను.

మాధ: (విసుగ్గా) ఈమాట చెప్పటానికి ఇంత నసుగుడు పెడతా వేమిటయ్యా?... ఇంద ఈ పావలా కాసు పట్టుకెళ్లు

ప్రసా: అబ్బే! అదికాదండీ నేనంటున్నదీ...

మాధ: పదులూ పాతికలూ ఇవ్వటానికి ఇక్కడ డబ్బుపోసుకు కూర్చోలేదు. ఇదుగో ఈ అర్ధరూపాయి పుచ్చుకెళ్లు...

ప్రసా: మీరిలా మాట్లాడతారనుకోలేదు సుమా!

మాధ: రాగానే వందరూపాయలనోట్లు విసిరేస్తాననుకొన్నావా? ఏవఁయ్యా?

ప్రసా: ఏదైనా చిన్న ఉద్యోగం దొరుకు తుందేమోనని ఆశ పెట్టుకొచ్చాను.

మాధ: ఏమీ ఖాళీలు లేవు. వెళ్లండి.

ప్రసా: మీరు తలచుకొంటే నాకో ఉద్యోగం ఇప్పించలేకపోరు దయచేసి...

మాధ. (చిరాగ్గా) నాయనా ఇది మిల్లు. ఇక్కడ లెక్కలు రాసేవారికిగానీ, కవిత్వం రాసేవాళ్ళకు ఉద్యోగాల్లేవు. ఇక దయచెయ్యండి.

## రావూరి భరద్వాజ

ప్రసా: నేనూ లెఖ్ఖలురాస్తానండీ ..

మాధ. రాసినా ఖాళీల్లేవు. ఇక వెళ్లండి.

ప్రసా: సరే సెలవు

మాధ: ఆహా మంచిది. వెళ్ళిరండి.

## 2

ఉమాపతి: ఎవరది?

ప్రసా: నమస్కారమండీ! నా పేరు ప్రసాదరావు.

ఉమా: నమస్కారం రండి. కూచోండి.

ప్రసా: నన్నింకా గుర్తించలేదను కొంటాను. కె. ప్రసాదరావునండీ నేను.

ఉమా: అరె మీరా కె. ప్రసాదరావుగా రంటే ... ఇవ్వాళ చాలా సుదినం ... ఉండండి కాఫీ తెప్పిస్తాను. (బిగ్గరగా) సూరీ! రెండు కాఫీపట్టుకురా. ఏమిటిలా వచ్చారు?

ప్రసా: (ఏమి అనడానికీ తోచక) ఆఁ వచ్చాను ఉమాపతి గారూ!...

ఉమా: మీ ఆర్టికిల్స్ మా పత్రికలో పబ్లిష్ చెయ్యడమేగానీ, మిమ్మల్నెప్పుడూ చూడలేదు.. అయితే మీరు యిప్పుడూ... ఇక్కడే ఉంటున్నారా?

ప్రసా: అవునండీ ఇక్కడే ఉంటు న్నాను

ఉమా: ఉండిగూడా మా పత్రిక్కి మీ రేమీ పంపటంలేదు

ప్రసా: ఏపత్రిక్కీ పంపటంలేదు. దాదాపు రెండుమూడు నెలలనుండీ నేనేమీ రాయటంగూడా లేదు

ఉమా. అలా మానేయకండి పాఠకులు మీ రచనలంటే పడిచచ్చిపోతారు. ఈ రెండుమూడు నెలలనుండీ మీ కథలు వేయటంలేదని బోలెడన్ని ఉత్తరాలు మా ఆఫీసు కొచ్చాయి. ఆఁ ముందా కాఫీ తీసుకోండి. మీకు సిగరెట్లు......

ప్రసా: థాంక్స్ అఖ్ఖర్లేదు. నేను కాల్చను

ఉమా: మీరు వ్రాసిన అన్నింటిలోకీ ఆ 'దేవలత' అన్న నాటకం అద్భుతంగా ఉన్నదని చాలామంది నాతో అన్నారు. అల్లాంటి ఉత్తమ రచనలను, సీరియల్ గా వేస్తున్నందుకు మా పత్రికను అభినందిస్తూ చాలా ఉత్తరాలు వస్తున్నాయి

ప్రసా అలాంటివి ఇప్పుడు రాయటం నావల్ల కాదు.

ఉమా: అట్లా అనకండి మీరు ప్రయ త్నిస్తే అంతకన్నా ఉత్తమంగా రాయ గలరు. మీవంటి సాహితీ తపస్వికి సాధ్యం గాని వేమున్నాయి?

ప్రసా: (నవ్వి) ప్రయత్నిస్తే రాయగల నేమో గానీ ప్రస్తుతం - ప్రయత్నం గూడా చేయలేను.

ఉమా: అలా అంటున్నారేమిటండీ?

ప్రసా. ఏమీ లేదు.

ఉమా: మీరేదో చెప్పటానికి సంకో చిస్తున్నారనుకుంటాను. అవునాండి?

ప్రసా. (విధి లేక అంటున్నట్లు) నా రచ నలను చాలా ప్రకటించారనుకుంటాను ఉమాపతి గారూ?

ఉమా: ఆఁ చాలా పబ్లిష్ చేశాను.

ప్రసా: మీ రెవరికీ ప్రతిఫలం ఇవ్వటం లేదా?

ఉమా. లేదు రచయితలకు తృణమో పణమో ముట్టచెబుదామని నాకూ ఉంది. కానీ అందుకు ఎంతమాత్రం వీలుచిక్కటం లేదు. నిజం చెప్పాలంటే ఈ పత్రికవల్ల నేను బావుకొంటున్న దేమీ లేదు. లేదు సరి గదా - ఒక్కొక్క సంచికకు నష్టాన్ని గూడా భరించవలసి వస్తోంది.

ప్రసా: నష్టాన్ని భరిస్తూ ఈ పత్రిక నడపడంకంటే మానేస్తే బాగుండిపోతుం దనుకొంటాను

ఉమా. మీరుగూడా ఇలా అంటా రను కోలేదు ప్రసాదరావు గారూ? అయినా సాహిత్యసేవను లాభనష్టాలతో గుణించటం సాధ్యమౌతుందా?

ప్రసా: ప్రపంచమంతా అణాపైసలకు

## కాంబోడియా కబుర్లు 12:

# రాజుగారి పుట్టినరోజు

(క్రొవ్విడి లక్ష్మన్న)

రాజుగారిపుట్టినరోజు పండుగ సాధారణంగా అయిదురోజులు జరుగుతుంది అయితే, రాజుగారు పుట్టినసంవత్సరానికి ఏజంతువు అధిపతో, ఆ జంతువు తాలూకు వర్షపంచకంలో, యీ పుట్టినదినపు పండుగ వారంరోజులు జరుపుతారు. (అరవై సంవత్సరాలు పన్నెండుభాగాలుచేసి, ఒక్కొక్క భాగానికి చెందిన అయిదువేళ్ళకీ ఒక్కొక్క జంతువు అధిపతి అని లోగడ రాసేను) ఈ అయిదురోజుల్లోనూ నాలుగోనాడు రాజుగారు పుట్టినతిథితో సరిపోతుంది. చాంద్రమానంప్రకారంన్నూ. ఈపుట్టినదినపుపండుగ రాజుగారు దీర్ఘాయుష్మంతులు కావాలనీ, అలా మతాధిపతులూ, బుద్ధత్రయం ఆశీర్వదించాలనిన్నీ వాడుకలోకి వొచ్చింది

ఈవేడుక అన్నాళ్ళూ దివానూ, యితర ఖొక్కసపు అధికారులూ కలిసి, రాజుగారి ఆభరణాదులన్నీ "ఎగ్జిబిషన్" పెడతారు. ఈ "ఎగ్జిబిషను" కోటలోనే ఓ భాగంలో పెడతారు. సిహనోక్ ప్రభువుకాలంనుంచీ, ఆభరణాదులేకాక, దేశంలో గల చిత్రవిచిత్ర వస్తుసముదాయంఅంతాకూడా "ఎగ్జిబిషన్"లో పెట్టడం ఆచారం అయింది. అంతేకాకుండా సాయంకాలం చీకటిపడ్డాక కోట ఆవరణప్రాంతాల్లోగాని, నది ఒడ్డునగాని రంగురంగులవీ, తమాషా అయినవి ఎన్నోరకాలు పటాకీలు కాల్చడంకూడా ఆనవాయితు!

తొలినాటి సాయంకాలం సింహాసనమూ అదీ ఉన్న కొలువుకూటంలో ప్రభువులు "విజయదీపిక (*Le Cierge de la Victore*) వెలిగిస్తారు. తేనెపట్టు కొవ్వుతో చేసిన యీ దీపం పదిహేనుపౌన్లు బరువూ, మూడడుగులుపొడుగూ ఉంటుంది. మట్టు డయామీటరు పది సెంటిమీటర్లు. ఈ లెఖ్ఖలూ తూకాలూ అన్నీ సరిగ్గా సరిపోతేనేగాని ఆదీపం యీ పుణ్యసమయానికి పనికిరాదు!

దీన్ని ఓ చిన్న వెదురుబొంగు మట్టుమీద నిలబెట్టి, ఆపాళంగా దాన్ని ఓ చిన్న పాలవిల్లిలాంటిదాన్లో పెడతారు ఈ పాలవిల్లి ముందు సుఖాసీనుడయి, బౌద్ధస్వాములవారు రాజుగారికోసం నిరీక్షిస్తూ ఉంటాడు. తరవాత ప్రభువులూ, ఆయనవెంట చక్కగా అలంకరించిన గిన్నెలో కొవ్వొత్తి పెట్టి పట్టుకుని పరిచారకుడూ ప్రవేశిస్తారు. ఆ తరవాత స్వాములవారు "విజయదీపిక" వెలిగించి బుద్ధ భగవానుడి కృపాకటాక్షాలు రాజుగారియందు కలగవలసిందిగా ప్రార్థిస్తాడు. (ఈ విజయదీపికతోనే యింకో పెట్రోలు లాంతరు కూడా వెలిగిస్తారు; ఓవేళ ఏ కారణంచేతనయినా యీ దీపిక అయిపోయినా, ఆరిపోయినా రెండోది అలా వెలుగుతూ ఉండడానికి!) అఖండదీపంలాగ యిది వెలుగుతూన్న అయిదు రోజులూ రాజుగారు కోట దాటి బైటికి వెళ్ళడానికి వీల్లేదు. ప్రార్థనలూ, బుద్ధప్రవచనపరసంవ్రూ అయింతరవాత, కోటలో ఉద్యోగులంతా అక్కడున్న చిన్నచిన్న దీపాలు వెలిగిస్తారు.

మొదటి మూడు రోజులూ ప్రార్థనలూ అవీ జరుగుతాయి. ఈ ప్రార్థనలు చెయ్యవలసిన బుద్ధభిక్షువులకీ ఒక లెఖ్ఖ! రాజుగారికి ఎన్నేళ్లు ఉంటే అంతమందీ + మరొక్కడూ!! ఈ మొత్తం భిక్షువుల జనాభా మూడు రోజులకీ సద్ది, ఆప్రకారం పార్థనలూ అవీ జరిపిస్తారు ముందునాడు ప్రార్థన జరిపినవాళ్ళందరికీ మర్నాడు ఉదయాన్ని ప్రభువులు విందుచేస్తారు, యీ మూడు రోజులున్నూ.

ఇలాగ్గానే రెండో రోజు ఉదయం, తొలిరోజు భిక్షువులకి సంతర్పణ జరుగుతుంది. ఆ మధ్యాహ్నం మళ్లీ బుద్ధభిక్షువులు ప్రార్థనలు జరుపుతారు; కాని యీ తంతులో తురకల ప్రార్థనలు కూడా ఉంటాయి, యీ రెండో రోజున! మహమ్మదీయులూ, బుద్ధ భిక్షువులూ కలిసి సింహాసనం చుట్టూ తిరుగుతూ (ప్రదక్షిణంలాగ) ప్రార్థనలు చేస్తారు * బ్రాహ్మలకీ, బుద్ధభిక్షువులకీ, తురకలకీ అందరికీ కలిపి మర్నాడు విందు!

* కాంబోడియా రాజ్యంలో "షామ్స్" (*Chams*) అనే తురకలుకూడా ఉన్నారు. షాంపా ప్రాంతం నాశనం అయిపోయినప్పుడు వీళ్లు కాంబోడియా (ఖ్మేరు) దేశంలో శరణుజొచ్చేరుట!

ఇహ, నాలుగోనాడు – ఆవేళ నిజంగా తిథిప్రకారం రాజుగారి పుట్టినరోజు.

ఉగాదినాటికి మల్లేనే ఆవేళ ప్రభువులు పవిత్రోదకస్నానం చేస్తారు. ఇరవైయొక్కసారి ఫిరంగులు పేలుస్తారు, యీ స్నానకర్మ జరుగుతూఉంటేను. ఆ తరవాత ప్రజలూ, విదేశీయులూ వొచ్చి రాజుగారికి తమ శుభాకాంక్షలు తెలుపుకుంటారు.

అయిదోనాడు, రాచకుటుంబంలో వాళ్ళకి, సిల్వర్ పెగోడాలో బుద్ధ ప్రవచనాలు పురాణశ్రవణం! ఆవేళ సిల్వర్ పెగోడాలో పంచక్షేత్ర విగ్రహాలూ (శివ, ఉమా, నారాయణ, గణేశ, బలరామ విగ్రహాలు), పవిత్ర కరవాలమ్వూ తెచ్చి ఉంచుతారు. వాటికి పక్కగా అయిదు నీటి కలశాలూ, పదహారు చిన్న కలశాలూ ఉంచుతారు. ఎనమండుగురు భటులని తీసుకువచ్చి గోడదగ్గిర రెండువరసల్లో కూచోపెడతారు వీళ్ళకి, యిద్దరిచేతుల్లో దండాలూ, నలుగురి చేతుల్లో కత్తులూ, యిద్దరికి తుపాకులున్నూ, కోటలోఉన్న ఉన్నతోద్యోగులు వీళ్లకి ధాతవస్త్రాలు యివ్వాలి తరవాత బ్రాహ్మడు (రాజపురోహితుడు) మంత్రాలు చదువుతాడు. ఆ సింహాసన ప్రాంతానికి అధిపతి అయిన "నక్తా" (స్థలదేవత) సంతోషించి, యిహ ఏ తేడా లేకుండా కాపాడుతుంది, రాజుగార్ని కోటనిన్నీ! ఆ తరవాత యిద్దరు రాజపురోహితులు, ఒకడు బల్లెం పుచ్చుకునీ, రెండోవాడు కత్తిపుచ్చుకునీ, ముమ్మారు కలశోదకాల్లో ముంచి, ఏవో వికార చేష్టలు చేస్తారు. దాంతో పటాపంచలై పోతుంది!

తరవాత ఒకడు మంత్రాలు చదువుతూ ఉంటే, మిగతావాళ్లు ముక్కముక్కా సంత చెప్పినట్టు రెండుసార్లు పునరుచ్చారణ చేస్తారు, – కలశాల్లో ఉన్న పవిత్రోదకాలు తీర్థం పుచ్చుకుంటారు.

ఆ మధ్యాహ్నం యీ మంత్రాలూ అవీ కేవలం కోటలో ఉన్న జనానాకి చదివి వినిపిస్తారు. ఈపూట మిగతా ఉద్యోగస్థుల ఆడవాళ్లుకూడా రావొచ్చునుగాని, మొగపురుగు అన్నవాడు ఉండడానికి వీల్లేదు మరి, ఒక్క పురోహితులు తప్పించీ!!

తదుపరి, బౌద్ధస్వాములవారి సమక్షంలో రాజుగురు "విజయదీపిక" ఆర్పేస్తారు. అయితే దీనికి ముందు, యీ దీపంతో యింకో చిన్నదీపం వెలిగించాలి. ఆ చిన్న దీపం, ఆ తరవాత, తమలపాకులు మడిచి పట్టుకుని, ఆ ఆకుల మడతలతో ఆర్పాలి! కాని సాధారణంగా జరిగేది ఏమిటంటే, చిన్నదీపం ఆకుల మడతలతో ఆర్పేసి, పెద్ద దీపం దానంతటదే ఆరిపోయేదాకా ఊరుకుంటారు. (యింకా ఉంది)



# యాదాలాపాలు

రాచకొండ శ్రీహరి

వెన్నెల
కొండలు మంచుముసుగుతో
చెరువులో చూచుకుంటున్నాయి.
ఎవరో నవ్వినట్టు
నీళ్లు గలగలలాడితే
నువ్వేననుకున్నాను పిచ్చిదాన్ని.

గుర్రపుమెళ్లో గజ్జెల్లాగా
కిచకిచలాడుతూ
పిచ్చుకలు పోతుంటే
నువ్వే నాకోసం
రథంలో వొస్తున్నావనుకున్నాను పిచ్చిదాన్ని.

రాత్రి
భోరనివర్షం
నిద్రలో
ఎవో చల్లనివ్రేళ్లు
చేయితాకితే
కళ్లుతెరిచాను
నీటిచుక్కలు
పైనుంచి పడుతుంటే
నువ్వేననుకున్నాను పిచ్చిదాన్ని.

నిద్రలాగా
లోకాన్ని చీకటిక్రమ్మింది
కలలాగా
ఈకాల్వ గడిచిపోతున్నది
దూరాన
తెల్లని తెరచాపవస్తుంటే
నువ్వేననుకున్నాను పిచ్చిదాన్ని.

వాన వెలిసింది
ముగ్గులు పెట్టినట్టు
నేలమీద నీళ్లునిలిచాయి
కప్పలు పాడుతున్నాయి
చంద్రుడు
మబ్బుచాటున తొంగిచూస్తే
నువ్వేననుకున్నాను పిచ్చిదాన్ని.

చింతతోపు
చిమ్మచీకటి
గబ్బిలాలన్నాయి నీవెవరవని
నేనన్నాను నీదాననని
అవిఅన్నాయికదా తానెవరని
నేనన్నానుకదా నేరునెగనని
గబ్బిలాలు కీచుకీచుమని నవ్వాయి
నేను నవ్వాను పిచ్చిదాన్ని.

---

కట్టుబడిఉన్నప్పుడు సాహిత్యం ఒక్కటీ కాని కలితంగా ఉండి లాభంలేదనుకుంటాను.

ఉమా: మీరేదో చిత్రంగా మాట్లాడుతున్నారు.

ప్రసా: ఎంతో కొంత ప్రతిఫలం మీరిస్తారనే ఆశతో వచ్చాను. సరే వెళ్తాను. సెలవిప్పించండి.

ఉమా: ప్రసాదరావుగారూ! మాట. ఇప్పుడే వెడుదురుగాని, చిన్నమాట. నే నొస్తున్నా ఆగండి.

ప్రసా: (దూరంగా) పిలుంటే మళ్లా కలుసుకొంటాను.

## 3

(ప్రసా: (తలుపు చప్పుడు చేస్తాడు).

శారద: (లోపలనుండి) ఎవరది? నా రింకా ఇంటికి రాలేదు పున్నయ్యగారూ! రాగానే చెబుతాన్లెండి.

ప్రసా: నేను శారదా! తలుపు తియ్యి.

శార: (తలుపు తీసి) చప్పున లోపలకు రండి.

ప్రసా: ఎందుకు?

శార: తరువాత చెబుతాను. ముందు మీరు లోపలకు పదండి...దోవలో మీకు పున్నయ్యగారు కనుపించలేదూ?

ప్రసా. లేదు.

శార: ఆయన ఇప్పటిదాకా ఇక్కడే ఉండి ఇప్పుడే వెళ్ళాడు.

ప్రసా: అలాగా?

శార: ఇప్పటికి రెండునెలల అద్దె బకాయి పడ్డాం. ఈనెలతో కలుపుకొని మూడునెల్ల కివ్వాలి.

ప్రసా: అలాగే ఇద్దాం.

శార: ఇద్దామంటే కాదు. మీరలా వెళ్ళంగానే వచ్చి కూచున్నాడు. డబ్బివ్వందే కదలనన్నాడు.

ప్రసా: మరి కదిలాడేం?

శార: 'రాగానే పంపిస్తానండీ' అని చెప్పి పంపేశాను.

ప్రసా: నమ్మాడా ఆమాట?

శార: పాలకునిషి ఉదయమేవచ్చి పెద్ద యాగీ చేసింది. దాన్ని సర్ది పంపేటప్పటికి నాతాతలు దిగొచ్చారు.

ప్రసా: అపాయం! అపాయం!!...

# యాదాలాపాలు

## రాచకొండ శ్రీహరి

వెన్నెల
కొండలు మంచుముసుగుతో
చెరువులో చూచుకుంటున్నాయి.
ఎవరో నవ్వినట్టు
నీళ్లు గలగలలాడితే
నువ్వేననుకున్నాను పిచ్చిదాన్ని.

గుర్రపుమెళ్లో గజ్జెల్లాగా
కిచకిచలాడుతూ
పిచ్చుకలు పోతుంటే
నువ్వే నాకోసం
రథంలో వొస్తున్నావనుకున్నాను పిచ్చిదాన్ని.

రాత్రి
ఘోరనివర్షం
నిద్రలో
ఏవో చల్లనివ్రేళ్లు
చేయితాకితే
కళ్లుతెరిచాను
నీటిచుక్కలు
పైనుంచి పడుతుంటే
నువ్వేననుకున్నాను పిచ్చిదాన్ని.

నిద్రలాగా
లోకాన్ని చీకటిక్రమ్మింది
కలలాగా
ఈకాల్వ గడిచిపోతున్నది
దూరాన
తెల్లని తెరచాపవస్తుంటే
నువ్వేననుకున్నాను పిచ్చిదాన్ని.

వాన వెలిసింది
ముగ్గులు పెట్టినట్టు
నేలమీద నీళ్లునిలిచాయి
కప్పలు పాడుతున్నాయి
చంద్రుడు
మబ్బుచాటున తొంగిచూస్తే
నువ్వేననుకున్నాను పిచ్చిదాన్ని.

చింతతోపు
చిమ్మచీకటి
గబ్బిలాలన్నాయి నీవెవరవని
నేనన్నాను నీదానవని
అవిఅన్నాయికదా తానెవరని
నేనన్నానుకదా నేరునెగనని
గబ్బిలాలు కీచుకీచుమని నవ్వాయి
నేను నవ్వాను పిచ్చిదాన్ని.

---

కట్టుబడిఉన్నప్పుడు సాహిత్యం ఒక్కటీ కాని కలితంగా ఉండి లాభంలేదనుకుంటాను.

ఉమా: మీరేదో చిత్రంగా మాట్లాడుతున్నారు.

ప్రసా: ఎంతో కొంత ప్రతిఫలం మీ రిస్తారనే ఆశతో వచ్చాను. సరే వెళ్తాను. సెలవిప్పించండి.

ఉమా: ప్రసాదరావుగారూ! మాట. ఇప్పుడే వెడుదురుగాని, చిన్నమాట. నే నొస్తున్నా ఆగండి.

ప్రసా: (దూరంగా) వీలుంటే మళ్లా కలుసుకొంటాను.

### 3

ప్రసా: (తలుపు చప్పుడు చేస్తాడు).

శారద: (లోపలనుండి) ఎవరది? నా రింకా ఇంటికి రాలేదు అన్నయ్యగారూ! రాగానే చెబుతాలెండి.

ప్రసా: నేను శారదా! తలుపు తియ్యి.

శార: (తలుపు తీసి) చప్పున లోపలకు రండి.

ప్రసా: ఎందుకు?

శార: తరువాత చెబుతాను. ముందు మీరు లోపలకు పదండి...దోవలో మీకు అన్నయ్యగారు కనుపించలేదూ?

ప్రసా: లేదు.

శార: ఆయన ఇప్పటిదాకా ఇక్కడే ఉండి ఇప్పుడే వెళ్ళాడు.

ప్రసా: అలాగా?

శార: ఇప్పటికి రెండునెలల అద్దె బకాయి పడ్డాం. ఈనెలతో కలుపుకొని మూడునెల్ల కివ్వాలి.

ప్రసా: అలాగే ఇద్దాం.

శార: ఇద్దామంటే కాదు. మీ రలా వెళ్ళంగానే వచ్చి కూచున్నాడు. డబ్బివ్వందే కదలనన్నాడు.

ప్రసా: మరి కదిలాడేం?

శార: 'రాగానే పంపిస్తానండీ' అని చెప్పి పంపేశాను.

ప్రసా: నమ్మాడా ఆమాట?

శార: పాలమనిషి ఉదయమేవచ్చి పెద్ద యాగీ చేసింది. దాన్ని సర్ది పంపేటప్పటికి వాతాలు దిగొచ్చారు.

ప్రసా: అపాయం! అపాయం!!...

# ★ ఆత్మహత్య ★

శార: (హడలిపోయి) ఏమిటపాయ మంటారు?

ప్రసా: బ్రతికున్న వాళ్లే బ్రతకలేక నానా బాధలు పడుతున్నారు. ఇక చనిపోయిన మీతాతలుగూడా దిగొస్తే మరీ చిక్కొస్తాయి. అపనిమట్టుకు చెయ్యకు.

శార: ఈ హాస్యాలకేంగానీ, మీరు వెళ్లిన దేమయింది?

ప్రసా: సోమన్న మాచవరంవెళ్లొచ్చాడు.

శార: పెద్దవాళ్లం మనం ఊరుకొంటాం. పిల్లలెలా ఊరుకొంటారండీ?

ప్రసా: మీనాన్న వట్టి అసమర్థుడని, మీకు కడుపునిండా తిండిగూడా పెట్టలేని అప్రయోజకుడనీ వాళ్ళకు నచ్చచెప్పు శారదా ... అంతకంటే నేనేమీ చెయ్యలేను.

శార: (ఖిన్నురాలయి) మీరే అలా అంటే ఎట్లాగండీ?

ప్రసా: పిచ్చిదానా! చాలామంది పడుతున్న బాధలే నువ్వూ పడుతున్నావు. అటువంటి మాట అనవలసినవాణ్ణి నేను, నాలాంటివాళ్లూను.

శార: వాళ్లవరకు కాచిపోద్దామన్నా ఇంట్లో చిట్టెడు గింజలు లేవు.

ప్రసా: అగు. ఏదో చప్పుడవుతోంది.

(తలుపు చప్పుడు)

శార: మన తలుపేలెండి. మీరలా లోపలికెళ్లండి. ఎవరో నేను కనుక్కొస్తాను (తలుపుతీసి) వారింకొరాలేదు పున్నయ్యగారూ.

అవతలమనిషి: ఎక్కడికెళ్లారు ఎప్పుడొస్తారు? రోజుకు పదిసార్లు తిరగలేక మా దుంప తెగిపోతోంది. అద్దెకు తీసుకొనేప్పుడుండే తొందర, అద్దె ఇచ్చేటప్పుడుగూడా ఉండాలి.

శార: ఇవ్వక మీ సొమ్ము ఎగవేశామటయ్యా?...

అ. మ. ని: పైగా కోపగించుకొంటారెందుకండీ? రెండు నెలలయింది. అద్దె యివ్వలేదు. నాకున్న నాలుగిళ్లవాళ్లూ యిలాగే తిప్పిస్తే అయినట్టే?

శార: తిరిగినంతకాలం తిరిగావు. సాయంత్రం కనిపించు. నీ బాకీ అణాపైసలతో ఇచ్చేస్తారు.

అ. మ. ని: సాయంత్రం మళ్ళీకాదంటే బాగుండదండోయ్. ఇప్పుడే చెపుతున్నా..

శార: తప్పకుండా ఇస్తారు. నువ్వు సాయంత్రం రా...

(తలుపువేసిన చప్పుడు)

ప్రసా: శారదా!

శార: వస్తున్నాను.

ప్రసా: సాయంత్రం అతడొస్తే చెబుతావ్?

శార: ఇప్పుడు వదిలించుకోవాలి. అంతకంటే మార్గంలేదు.

ప్రసా: ఇలా ఎంతకాలం జీవించగలం శారదా?...

శార: అన్నట్టు మీరేదో పుస్తకం రాస్తున్నారు గదా?

ప్రసా: అవును. 'ఆత్మహత్య' అని ఒక నాటకం ప్రారంభించాను. అదింకా పూర్తి కాలేదు.

శార: ఎప్పటి కవుతుంగంటారు? దాన్ని ఎవరికన్నా అమ్మితే...

ప్రసా: అందులో కథానాయకుడు ఆత్మహత్య చేసుకొంటాడు. అంతటితో పూర్తవుతుంది.

శార: పోనీ త్వరగా కానిచ్చేయ గూడదూ?

ప్రసా: నేనూ అదే ఆలోచిస్తున్నాను. ప్రస్తుతం కథానాయకుడు జీవితంతో కుస్తీ పడుతున్నాడు. జీవితంలో తగిలే తన్నులు భరించలేక అలమటించి పోతున్నాడు. ఇదే ఆఖరు సీను - చివరకు బాధలు భరించలేక విషం త్రాగి చచ్చిపోతాడు. అంతటితో నాటకం అయిపోతుంది.

శార: (హాస్యంగా) ఆ కథానాయకుడికి పెళ్లాం పిల్లలు లేరుటండీ? వాళ్ళేం చేశారు?

ప్రసా: వాళ్ల కర్మానికి వాళ్లనొదిలి... హాఁ మిస్టర్ రాజారావ్! ఎంతసేపయింది నువ్వొచ్చి?

రాజా: నీ కథానాయకుడు ఆత్మహత్య చేసుకోబొయ్యేముందె వచ్చాను.

శార: ఇంకా నయం అడ్డుకోలేదు అన్నయ్యా...

రాజా: లేదమ్మా తల్లీ!...ఆ పనిగూడా చేశాను. లేకపోతే ఆ కుటుంబమంతా ఏం గావాలి?

శార: నేనూ అదే అడుగుతున్నా నన్నగారూ!...

రాజా: అయినా అదేం నాటకమోయ్! జీవితంమీద అంత భయపడతాడా నీ నాయకుడు? కష్టాలొచ్చాయని ఆత్మహత్య చేసుకోవటం అవివేకం.

ప్రసా: వాటిని ఛేదించాలని అతిగాఢు తీవ్రంగా ప్రయత్నిస్తాడు. అన్నీ విఫలమయ్యాయి. గత్యంతరంలేక విషం తాగేస్తాడు.

రాజా: దాన్ని ఎలా సుఖాంతం చెయ్యాలో నేను చెబుతానుపట్టు...ఏం చెల్లెమ్మా అలా నిలుచున్నావ్? ముందీ పాతికరూపాయలు పట్టుకెళ్ళి అవసరాలేమిటో చూడు....

శార: ఒద్దులే అన్నగారూ!...

రాజు: ఇది నాకు అవమానమేగా!

ప్రసా: ఇప్పటికే నీదగ్గర చాలా తీసుకొన్నాను.

రాజా: అయినా ఇస్తున్నది నీక్కాదు కాదనకు. తీసికెళ్ళమ్మా... ఈపూట ఈ రాజిగాడు ఇక్కడే భోంచేస్తాడు...

ప్రసా: నీమేలు మరిచిపోలేను రాజా!.. మెనీ మెనీ థాంక్స్!...

రాజా: ఆగరా నాన్నా ఆగు. అన్ని థాంక్సూ ఇప్పుడే ఖర్చు పెట్టకు చూడు. నీ కథానాయకుడు జీవించటం చేతకాక విషం తాగటంతో నాటకం ట్రాజెడీ అవుతుంది కదూ?

ప్రసా: అవును.

రాజా: దాన్ని కామెడీగా నేను మార్చేస్తాను. నువ్వలా చూస్తూవుండు.

## 4

(జనం రణగొణ ధ్వనులు. 'ఇదుగో కూచో.' 'అయ్యా నిశ్శబ్దంగా ఉండండి.' 'అబ్బబ్బబ్బా కాలు నలగదొక్కేశావయ్యా' 'వెనక నుంచున్నవారందరూ ముందుకు రావాలి' వగైరా కేకలు)

పున్నయ్య: సోదరులారా! దయచేసి అందరూ నిశ్శబ్దంగా ఉండాలని ప్రార్థిస్తున్నాను. దయచేసి అందరూ... ఈరోజున ఇక్కడ మనం ఈవిధంగా సమావేశం కావలసివస్తుందని ఎవ్వరూ అనుకోలేదు. మన దురదృష్టవశాత్తూ ఆ మాటకొస్తే ఆంధ్రజాతి దురదృష్టంవల్ల శ్రీ ప్రసాదరావుగారు చనిపోయారు. వారి స్మారకార్థం జరుపబడుతున్న ఈ సభకు ప్రఖ్యాత పారిశ్రామికవేత్త శ్రీ మాధవయ్యగారిని అధ్యక్షులుగా ఉండమని మీ అందరితరఫున నేను కోరుతున్నాను. (చప్పట్లు)

మాధ: మహాజనులారా! శ్రీ పున్నయ్యగారు నన్నీ సభకు అధ్యక్షులుగా ఉండమని కోరారు. నాకాయోగ్యత లేదనే నేను నమ్ముతున్నాను. ఎందుకంటే శ్రీ ప్రసాదరావుగారితో నాకంతగా పరిచయం లేదు. వారి రచనలుగూడా నేనాట్టే చదవలేదు. ఒకేసారి వారు నాదగ్గరకొచ్చారు. వచ్చి మాట్లాడిన ఆ పదినిముషాలు నాజీవితంలో అమూల్యమైనవిగా నేను భావిస్తున్నాను. అప్పట్లో వారేదో పెద్దగ్రంథం వ్రాస్తున్నామనీ, అచ్చువేసేవిషయంలో నాసహాయం కావాలనీ అన్నారు. ఉడతాభక్తిగా నేనో వెయ్యిరూపాయలిస్తానన్నాను. వారు జీవించి ఉన్నట్లయితే, ఆ గ్రంథం విధిగా అచ్చయి ఉండేది. అవిధంగా జరుగకపోవటం మన దురదృష్టం. శ్రీ వారికుటుంబానికి ఒక నిధి నేర్పాటుచెయ్యాలని నాసంకల్పం. నావంతు వెయ్యిరూపాయ లిస్తున్నాను. ఇతరులు కూడా యథాశక్తిని చందాలివ్వాలని ప్రార్థిస్తూ నేనింతటితో విరమిస్తున్నాను. తరువాత శ్రీ ఉమాపతిగారు ఉపన్యసిస్తారు.

ఉమా: మహాశయులారా! అన్యక్షా!! ఈ దుఃఖసమయంలో నేనెక్కువ మాట్లాడలేను. శ్రీ కె. ప్రసాదరావుగారి రచనలు మా పత్రికలో మీరు చదివే ఉంటారు. వారికీ నాకూ ప్రగాఢమైన మైత్రి ఉండేది. అనేకరచనలు వారు మా ఆఫీసులో కూచునే రాశారు. భాషలోను, భావంలోను వారి రచ



# "సోదర సోదరీ మణులారా!"

కర్నూలు, ఏప్రిల్ 25.

అలవాటు చెడ్డది.

అది శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహంగారి 'సాక్షి' యుగం. సుప్రసిద్ధుడు స్వర్గీయ జంఘాలశాస్త్రి ఉద్రేకానికి గురి అయినప్పుడు అల్లా 'నాయనలారా' అంటూ ప్రారంభించి మహోపన్యాసాలు చేసే రోజులు అవి. వాటిని తలంచుకుంటే భార్య (అదృష్ట వశాత్తు జంఘాలశాస్త్రి ఉద్వాహం ఆడలేదు) ఎదురుపడినా సరే, ఆ మహావక్త ఆమెను 'నాయనలారా' అని పలుకరించి ఉండేవాడా అనే అనుమానం కలుగుతుంది.

ఇక నేటి గాథ.

ఇటీవల ఎన్నికలు జరిగినవి. అభ్యర్థులు, రాజకీయవాదులు ఎన్నికల ప్రచారం సాగినంత కాలం ఎప్పుడు పడితే అప్పుడు, అవసరం ఉన్నా లేకపోయినా, ఉపన్యాసాలు ఇవ్వడానికి అలవాటు పడిపోయారు. ఎన్నికలు ముగిసినవి.

ఇంకా ఇటీవల శాసనసభ సమావేశమైనది. అధ్యక్షుని ఎన్నిక జరిగినది. సభ్యులు అధ్యక్షుడు ఎన్నిక అయినందుకు అభినందిస్తూ ప్రసంగించారు.

ఒక సభ్యుడు ఉపన్యాసం ప్రారంభిస్తూ, "సోదర సోదరీ మణులారా!" అని సంబోధించాడు. (సభలో నవ్వు.)

స్పీకరు: ఆర్డర్, ఆర్డర్.

(బి. సి. క.)

# ★ ఆత్మహత్య ★

కలుఉత్తమమైనవి. రచనాసంవిధానం, శిల్పం, నూత్న పదప్రయోగాదులను గూర్చి నేను చేసిన సూచనలను వారు అంగీకరించటం, నా భాగ్యంగా భావిస్తున్నాను. చివరి దశలో వారు నన్నొక సహాయ మర్థించారు. క్షమించండి.. విచారభారంవల్ల నే నే క్కువ మాట్లాడలేకపోతున్నాను. వారి కుటుంబనిధికి నేనూ నూటపదహార్లు సమర్పించుకొంటున్నాను. వారి సాహిత్య సేవకు ప్రతిఫలంగా వచ్చే సంచికను శ్రీవారి సాహిత్యసంచికగా అర్పిస్తానని ఆంధ్ర మహాజనులకు మనవిచేస్తూ ఇంటితో సెలవు తీసికొంటున్నాను...

మాధ: ఇప్పుడు వారి యింటి యజమాని, మునిసిపల్ కౌన్సిలర్ అయిన శ్రీ పున్నయ్య గారు ప్రసాదరావుగారి జీవిత విశేషాలను గురించి చెబుతారు.

పున్న: సోదర సోదరీమణులారా!... ఇక్కడ సోదరీమణులుగూడా ఉన్నారనే భావిస్తున్నాను. శ్రీ ప్రసాదరావుగారు గత సంవత్సరంనుండీ మా యింట్లోనే ఉంటు న్నారు. తెలియని రోజుల్లో శ్రీవారినుండి నేను అద్దె పుచ్చుకొన్నాను. వారు గొప్ప కవులని, మంచి పండితులని తెలిసిన తరువాత, అటువంటి మహానుభావులు మా యింట్లో ఉండడమే మహాభాగ్యంగా భావించాను. శ్రీ ప్రసాదరావుగారు వ్రాసిన రచనలన్నీ మా యింట్లోఉండే వ్రాశారు. నేను, నా యిల్లు ఈమాత్రమైనా శ్రీ ప్రసాదరావుగారికి ఉపయోగపడినందుకు నేను గర్విస్తున్నాను. ప్రసాదరావుగారి కుటుంబ నిధికి ఐదువందల రూపాయలు ఇప్పుడే సమర్పించుకొంటున్నాను. మరి నాకు సెలవు.

మాధ: ఇంకెవరైనా మాట్లాడేవారుంటే మాట్లాడవచ్చు.

రాజా: నేను మాట్లాడతాను.

మాధ. మీ పేరేమిటన్నారూ? సభలో పరిచయం చేస్తాను.

రాజా: నేనే చెప్పుకొంటాను. మహాశయులారా!...నాపేరు రాజారావని మీ కందరకూ తెలుసు. ప్రసాదరావుగారు నాకు మిత్రుడు. అందువల్ల అందరికన్నా అతని



విషయం నాకు క్షుణ్ణంగా తెలుసు. ప్రసాదరావు సాహిత్యసేవనుగురించే వీరంతా చెప్పారు. అతనెందుకు చనిపోయిందీ వీరు చెప్పలేదు. ప్రసాదరావు భయంకరమైన దారిద్ర్యం అనుభవించాడు. కూటికీ గుడ్డకూ అలమటించాడు. ఇంతటి మహాపట్నంలో అతను చేసేందుకు పాతిక రూపాయల ఉద్యోగం దొరకలేదు. డజన్ల కొద్దీ రచనలు ప్రకటించిన పత్రికలు చిల్లి కానీ ప్రతిఫలమివ్వలేదు.

ఉమా: అబద్ధం. నేనిచ్చాను

రాజా: నన్ను మాట్లాడనివ్వండి. ఇంటి యజమాని, కిరాణాకొట్టుషాహుకారు, పాల మనిషి, మందుసీసా, పిల్లలు, ఆకలి, భార్య, అతనికి ఘోరమైన అశాంతిని కలిగించాయి.

మాధ శ్రీ ప్రసాదరావుగారు చనిపోయిన రోజునే నేను వెయ్యిరూపాయలిస్తాను, రేపు రండి అని చెప్పాను

ఉమా: ఆనాడే నేను ప్రతిఫలం క్రింద రెండువందలలో రెండువందల పాతిక యిచ్చాను.

పున్న: నేను అద్దె అడిగి పదినెలలయింది. వారు నాయింట్లో ఉండడమే నాకు మహాభాగ్యం.

రాజా: ఈ మహామహులంతా, అతను బ్రతికుండగా ఏమాత్రం సాయంచేసినా, ప్రసాదరావు మనకు దక్కేవాడు. ఇప్పుడు చూడండి. మాధవయ్యగారు వెయ్యిరూపాయలకు చెక్కు రాసిచ్చారు. ఈ సంపాదకులు రొక్కం యిచ్చారు. పున్నయ్యగారు గూడా డిపాజిట్ చేశారు. అతను బ్రతికున్నట్లయితే, ఈ సొమ్ము అతనికి దక్కేది.

మాధ: ఊళ్లో పదివేలుదాకా చందాలు వసూలుచేస్తాను. ఆ పూచీ నాది. వారి సాహిత్యసేవకు ఎంత ఇచ్చినా చాలదు.

రాజా. అవును గదా అదృష్టవశాత్తూ అతను జీవించేవుంటేనో?

(జనంలో కలకలం)

మాధ: ఆఁ ఎమిటీ?

ఉమా: ప్రసాదరావు చనిపోలేదా?

పున్న: జీవించే ఉన్నాడా?

ప్రసా: ఆఁ జీవించే ఉన్నాను. ముసుగు వేసుకొని ఈప్రక్కనే కూచున్నాను. మీ ఉపన్యాసాలన్నీ విన్నాను.

(పెద్దగోల)

రాజా. అయ్యా ఒక్కనిమిషం ఆగండి ప్రసాదరావుగారు ఇక్కడే ఉన్నారు. వారు విషం త్రాగలేదు. చచ్చిపోనూలేదు. కానీ చనిపోయారని పత్రికలో చదివారు. సభచేశారు. కనీసం ఆ శవాన్ని ఎప్పుడు ఖననం చేశారోగూడా వీళ్లకు తెలీదు. అయితేనేం ప్రసాదరావుకు లోకాన్ని గురించి కనువిప్పయింది. ఎంతో కొంత డబ్బుగూడా లభించింది. (సభలో రణగొణ ధ్వని) ఇప్పటికే అన్యతులు ఉపన్యాసకులు పారిపొయ్యారు.

* * *

## 5

మీరుగూడా సుఖంగా ఇళ్ళకు జేరు కోండి

* * *

కా. ఏమండి మీటింగ్ అయిందా? ఏమయింది?

ప్రసా: నా నాటకం కామెడీ అయింది. కథానాయకుడు పరిస్థితులనుతట్టుకొంటాడు. అయితే ఆత్మహత్య అన్న పేరుమార్చేస్తాను.

రాజా: ఎంతమాత్రం వద్దు.

ప్రసా: ఎందుకని? హీరో ఆత్మహత్య చేసుకోలేదుగా?

రాజా. కానీ, చాలామంది కల్పపాత్ర లను హత్యచేశాడు. నాటకానికి విధిగా ఆత్మహత్య అన్న పేరే ఉంచు.



# అసలు లావెక్కడంలోనే ఉంది తమాషా అంతా

**తురగా కృష్ణమోహనరావు**

మొన్న నోసారి ఓ తమాషా జరిగింది ఓ రిక్షాలో లావుపాటి పెద్దమనిషి కూర్చుని పోతున్నాడు. రిక్షావాలా పక్కకుపోయాడు ఏదో పనిమీద రిక్షాఆపి. రిక్షా 'ఉతారు' లోకి జారుకుంటూపోవడం మొదలెట్టింది. రిక్షా వెనక్కి వెనక్కి పోతూంటే - ఆ పెద్దమనిషి - ఏమీ చెయ్యలేక - దిగాలుపడి కూర్చున్నాడు అటూ ఇటూ పోయేజనంఅంతా - ఇదిచూసి పకపకానవ్వడం ప్రారంభించారు. ఇంతలో రిక్షావాలా తిరిగొచ్చాడు వచ్చినవాడు - రిక్షా అపచ్చా? - ఉహూ! - వెనకాతల చేతులు పెట్టుకు నవ్వడం మొదలెట్టాడు ఆ రిక్షా గిర్రున తిరిగి పేవుమెంటుకి తగిలి పక్కనే ఆగింది. ఆ నవ్విన ప్రజానీకంలో నేనూ ఉన్నాననుకోండి! కాని - ఏం ప్రమాదం జరగలేదు కాబట్టి సరిపోయింది. వెనకాతల కారూగీరూవస్తే ఏమయేది?

అసలు ఈ సంగతంతా ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే - లావుపాటి వాళ్లను చూస్తే ఎందుకో అందరికీ వెక్కిరింపూ వేళాకోళమూను. ఈ రిక్షాసంగతి అల్లా ఉంచండి మరెక్కడయినా సరే - అదేమిటో. లావుపాటివాళ్లను చూడగానే నవ్వడం ప్రారంభిస్తారు జనం. మనిషి లావు ఎంత ఎక్కువఅయితే వీళ్లనవ్వు అంత ఎక్కువ అవుతుంది. అప్పుడప్పుడు నేననుకుంటూంటాను, ఈ నవ్వుతూన్న వాళ్లను పిలిచి కేకలెయ్యాలని "ఏమిటయ్యా! మీరంతా ఎందుకయా నవ్వుతున్నారు? ఆయనలావుకీ మీనవ్వుకీ సంబంధం ఏమిటి? ఆయన లావుగా ఉండడం ఆయనతప్పు కాదుగదా? ఒకవేళ - అది ఆయనలో లోపమే అనుకోండి. అయితే - ఆయన్ని చూసి జాలిపడాలిగాని; నవ్వుతారా? ఊఁ చాల్లెండి!" అని.

వెంటనే మీరడుగుతారు. "మీ కెందుకండీ ఈ ప్రేమాభిమానాలూ - లావుపాటి వాళ్లంటే?" అని. మీరల్లా అడిగితే నేను చెప్పలేననుకోండి. సహజంగా నేనంతి లావుపాటిమనిషిని కాదు. ఏదయినా కొద్దో గొప్పో లావున్నప్పటికీ - అది పొడుక్కు తగ్గలావే అనుకుంటాను. మా ఆవిడ అప్పుడప్పుడు ఏదో అంటూంటుందికాని - ఆఁ! మా ఆవిడఅంటానికేం లెండి. మనిషి - మహా వేళాకోళాలు చేస్తూంటుంది. నిజంగా నేను కనక లావే అయితే మొహంమీద ఎప్పుడో చెప్పేసుండును.

పోనీ! - నేను నిజంగా లావుపాటి మనిషినే అనుకోండి. ఇంకా! - రోజురోజుకీ లావెక్కుతున్నాననుకోండి! అహా! అనుకోండి - నిజంగా అల్లా జరుగుతూందని కాదు. ఒకవేళ నిజంగా అల్లా జరిగినా; అందులో విచారపడవలసిందీ, మధన పడవలసిందీ ఏముంది? ఏమీ లేదు - సరికదా! - మీ రడుగుతున్నారు కాబట్టి చెవుతున్నాను—నాకు; లావుపాటివాళ్లను చూస్తే మహా గౌరవం! లావెక్కుతున్నవాళ్లను చూస్తే మరీ గౌరవం! ఒకరు జీవితంలోని పరమ లక్ష్యాన్ని అప్రయత్నంగానే సాధించారు; రెండోవారు. ఆ లక్ష్యసాధనకోసం కష్టాలు పడుతూ ముందుకు సాగుతున్నారు. అసలు నన్నడిగితే—లావెక్కడంలోనే ఉంది తమాషా అంతా అంటాను.

అసలు ప్రపంచంలో కీర్తి గడించిన వాళ్ళంతా లావుపాటి వాళ్ళే ఈ మాట ఇప్పుడే కాదు; పూర్వకాలంలో కూడా నిజమే. డా. జాన్సన్ సంగతి చూడండి. ఇంగ్లీషులో ఒక పెద్ద డిక్షనరీ రాశాడు; చాలా గొప్పవాడని ప్రసిద్ధి కెక్కాడు. అతడు రాసిన రచనల విషయంలో ఎంత పేరు తెచ్చుకున్నాడో - తిండి తినడం విషయంలో కూడా అంత పేరూ తెచ్చుకొన్నాడు చెపుతూంటారు అతగాడు రాసింది అట్టేమంది చదవరట కాని అతన్ని మాత్రం మరిచిపోలేరుట. కేంటర్బరీ కథలు రాసి ప్రసిద్ధికెక్కిన ఛాసర్‌ను తీసుకోండి- లేదా; షేక్స్పియర్ కాలపు గొప్ప నాటక రచయిత బెన్ జాన్సన్‌ను తీసుకోండి వారందరూ కూడా వారి గ్రంథాల నిమిత్తం ఎంత ప్రసిద్ధి కెక్కారో వారి 'ఉదర నిమిత్తం' కూడా అంతే ప్రసిద్ధి కెక్కారు.

అదంతా దేనికి? మన పోతనామాత్యుడి సంగతి చెప్పండి. తెలుగుజాతికి చెందిన వాడెవడయినా ఆంధ్ర మహాభాగవత కర్త పోతన పేరు వినకుండా ఉంటాడా? దైవ భక్తులు కానీండి; సాహితీవేత్తలు కానీండి- దేశింటింటా పోతన పేరు వినబడవలసిం కదా! అట్టి మహాకవి పోతన లావుగా ఉండేవాడా? సన్నంగా ఉండేవాడా? నాగయ్యగారి పోతన చూసినవాళ్లకు ఈ విషయంలో ఏమాత్రం సందేహం ఉండకూడదు.

పూర్వకాలపువాళ్ళ సంగతి దేనికి? సర్ విన్స్టన్ చర్చిల్ సంగతి చెప్పండి; రఫీ అహ్మద్ కిద్వాయ్ సంగతి చెప్పండి; ఆంధ్రకేసరి ప్రకాశం సంగతి చెప్పండి; శ్రీ శ్రీప్రకాశా సంగతి చెప్పండి. జర్మనీ మీద యుద్ధంచేసి చర్చిల్ పేరు తెచ్చుకొంటే; కరువు కాటకాలపయిన దాడిచేసి కిద్వాయ్ పేరు గడించాడు. జాతీయోద్యమ యోధులుగా ప్రసిద్ధికెక్కి, తర్వాతి రోజుల్లో ముఖ్యమంత్రిగా ప్రకాశం; గవర్నరుగా శ్రీప్రకాశా వెలుగు తెచ్చుకొన్నారు. వీళ్లందరూ లావుగా లేరూ?

అయితే ఒక విషయం అందరు గొప్పవాళ్ళూ లావుగా ఉంటారని నేనంటల్లేను. ఉదాహరణకి: బెర్నార్డ్‌షాను తీసుకోండి. ఆయన సన్నంగా తాడులా ఉండేవాడు. అయితే నేం? చాలా పేరు సంపాదించుకొన్నాడు. అందుకు సందేహం లేదు. అయినప్పటికీ - ఇది కూడా ఆలోచించండి. షా సన్నగాఉంటేనే అంత గొప్పవాడయ్యేడే; లావుగా ఉంటే ఇంకా ఎంత గొప్పవాడయ్యేవాడో! ఊహించలేం. చాలా గొప్పవాడయిపోయేవాడు. బహుశః షేక్స్పియర్‌ని మించిపోయేవాడు.

షేక్స్పియర్ అంటే జ్ఞాపకం వచ్చింది. షేక్స్పియర్ లావుగా ఉండేవాడంటారా? సన్నంగా ఉండేవాడంటారా? నా ఉద్దేశ్యం అతను చాలా లావుగా ఉండేవాడని. ఎల్లాగ? - అని నన్నడక్కండి - నేను చెప్పలేను. అతని బొమ్మనిచూస్తే అల్లా అనిపిస్తుంది. పయిగా - ఫాల్స్టాఫ్ అంతటివాణ్ణి సృష్టించిన కవిశేఖరుడు లావుగా ఉండడంటే ఎలాగ నమ్మడం?

బెర్నార్డ్‌షా చివరి రోజుల్లో ఎప్పుడూ చిరాకుగా ఉండేవాడుట గొప్పవాడు కదా అని ఇంటర్వ్యూకోసంపోతే కర్ర పుచ్చుకొని వీధిగుమ్మంవరకూ తరిమికొట్టేవాడుట. ఇంత చిరాకు లావుపాటివాళ్ళ కుంటుందంటే మీరు నమ్మగలరా? నేను

# అసలు లావెక్కడంలోనే ఉంది తమాషా అంతా

నమ్మలేను. మీ రెప్పుడయినా చూశారో లేదో - లావుపాటివాళ్ళ దన్న హాస్యం సన్నపాటివాళ్ల దగ్గర ఉండనే ఉండదు. వాళ్ళదగ్గర—అంటే నా ఉద్దేశ్యం లావుపాటివాళ్ళదగ్గర అని - ఎప్పుడూ చిరునవ్వులు తొణికిసలాడుతూ ఉంటాయి. వాళ్లెప్పుడూ తమను తమే వేళాకోళం చేసుకొంటూ తిరుగుతుంటారు. కుర్చీలో కూర్చొంటూ "ఈ కుర్చీ ఉంటుందా ఊడుతుందా?" అనే వాళ్లను నేను చూశాను. హోటల్లో భోజనానికి వెళ్ళి, "ఈవాళ మీ హోటల్ దివాళాయే" అంటూ భోజనానికి కూర్చొనేవాళ్లను నే నెరుగుదును. మా మిత్రుడొకాయన ఉన్నాడు: "ఈవేళ మీ కారులో నాకు సీటుంటుందా?" అని అడిగితే; "ఈవాళ మా ఆవిడకూడా వస్తూందండీ! ఇద్దరూ కూర్చొన్నప్పుడు కారులో ఇంక సీటుండదూ!" అంటూంటాడు. ఇప్పటికీ మా స్నేహితు డొకాయన కారులో కూర్చుంటే మధ్యన కూర్చుంటావని పేచీ పెడతాడు; "ఏమయ్యా?" అంటే "ఎందుకైనా మంచిది!" అంటాడు.

ఈ శక్తి - తనని చూసి తనే నవ్వుకోగల శక్తి - సన్నపాటివాళ్లకి చస్తే రాదు - అంటే - అదే - మాటవరసకి చెపుతున్నా ననుకోండి. బెర్నార్డ్‌షా సంగతి చూశారుగా! జనాభా అంతా అలాగే ఉంటారు. వాళ్లకున్న కృత్రిమపు తెలివితేటలు లావుపాటివాళ్ల కసలేరావు. లావుపాటివాళ్లు ఎప్పుడూ నవ్వుతూ పేలుతూ ఉంటారేమో - వాళ్లకి కృత్రిమాలూ కుట్రలూ అర్థంకావు. సన్నపాటివాళ్ల సంగతి చెప్పక్కర్లేదు. షేక్స్పియర్ ఏమన్నాడో తెలుసా? 'లీన్ అండ్ హంగ్రీ కేసియస్' అన్నాడు. మరి కేసియస్‌ను చూడండి; ఫాల్స్టాఫ్‌ను చూడండి.

మనలో ఒక సామెతఉంది: "పొట్టివాళ్ళకి పుట్టెడు బుద్ధులు" అని. పొట్టివాళ్లని సాధారణంగా నమ్మడానికి వీల్లేదు. వాళ్లు ఎప్పుడు ఎక్కడ ఏం చేస్తుంటారో ఆ భగవంతుడికి తెలియాలి. అవునా? అతగాడికయినా తెలిసో? తెలియదో? సందేహమే. పాపం ఈ లావుపాటివాళ్ళున్నారు చూశారూ? పొట్టివాళ్ళ చేతుల్లో ఇట్టే మోసపోతుంటారు. అయితే - పొడుగులో పొట్టివాళ్లు, "పొట్టి" అయితే, లావులో సన్నవాళ్లు "పొట్టి!" అంతే గదా? మరి పొడుగులో పొట్టివాళ్ళను నమ్మడానికి వీల్లేకపోతే లావులో పొట్టివాళ్ళను ఎల్లా నమ్మగలం? షేక్స్పియర్ ఊరికే అనుంటాడా?

మరి సన్నగా ఉన్నవాళ్ళందరూ లావుపాటి వాళ్ళను ఎందుకు హేళనచేశారు? చెప్పమంటారా? కారణం ఏమిటంటే - వాళ్లకూడా మనస్సులో లావెక్కాలనే ఉంటుంది. లావెక్కితే బాగుంటుందని వాళ్లూ అనుకొంటూరు. కాని లావెక్కడం చేతకాక - మనస్సులోని అక్కసు నంతని ఈ విధంగా బయటపెడుతూంటూరు. భగవంతుడు హఠాత్తుగా ప్రత్యక్షుమై. "నీకు లావుకావాలా? బలం కావాలా? ఈ రెంటిలో ఏదో ఒకటే కోరుకో!" అన్నాడనుకోండి. వెంటనే వాళ్ళందరూ "లావే కావాలి!" అని ఏకగ్రీవంగా కోరుకొంటూరనడంలో సందేహంలేదు.

అసే పూర్వకాలపు వాళ్ళకి ఇప్పటి కాలపు వాళ్లకి తేడా. అప్పటి వాళ్ళు ఇప్పటివాళ్లలాగ మనస్సులో ఒకటి పెట్టుకొని ఇంకొకటి మాట్లాడడం ఎరగరు. వాళ్లు 'మనసా. వాచా: కర్మణా' ఎల్లప్పుడూ సత్యాన్నే కలిగుండే వారట. వాళ్ళకి మనస్సులో లావెక్కాలని బుద్ధిపుట్టింది అనుకోండి. ఆ విషయం పయికి స్పష్టంగా చెప్పేవారు. ఇప్పుడో? అల్లాకాదు. ఆ విషయం మనస్సులో పెట్టుకొని; పైకి అడగడానికి సిగ్గుపడి; లావుపాటివాళ్లను వేళాకోళం చేస్తూ తిరుగుతారు; కాలం గడుపుతారు. చూస్తూంటే అసహ్యం వేస్తుంది. మరి పూర్వకాలపు వాళ్లసంగతి చూడండి! గజేంద్రు డేంచేశాడు? లావెక్కాలని బుద్ధిపుట్టింది. వెంటనే దేముణ్ణి ప్రార్థించాడు. "లావొక్కింతయు లేదు ధైర్యమున్ విలోలంబయ్యె..." అంటూ. అంటే; 'లావు - "ఒక్కింతయు" - ఒక్క యూనిట్ కూడా లేదు - చూడగా చూడగా "ధైర్యమున్ విలోలంబయ్యె" - నెర్వస్ వీక్నెస్ వచ్చేటట్టుగా ఉంది - రక్షింపవయ్యా - భగవంతుడా - రక్షించు' అంటూ మొఱపెట్టుకొన్నాడు. సర్వాంతర్యామి భగవంతుడు. అతనికి తెలియని వంటూ ఏమీలేవు; భక్తుల కోర్కెలను అతడెన్నడూ తిరస్కరించలేదు. గజేంద్రుడికి ఏదో ఒక 'టానిక్' ఇచ్చుండాలి. ఏమిచ్చుంటాడో తెలియదు. ఈ కాలపు భగవంతుడయితే ఏ 'మస్కామసాలా' దోశో తీసుకోమని చెప్పుండేవాడు. పోతన రచనలన్నిటిలో సమగ్రపరిశోధన చేస్తే విషయాలు గ్రాహ్యం అవుతాయి. ఎవరేనా పుణ్యం కట్టుకుంటే బాగుణ్ణు

లావుపాటి వాళ్లు సన్నపాటి మనుష్యులకంటే మానసికంగా ఉత్తమ స్థాయిలో ఉంటారని నిరూపించాను ఇంకా అనేక ఉదాహరణలు చూపించవచ్చు. కాని కాలం మనకు వ్యతిరేకంగా నడుస్తూంటుంది అయితే - లావుపాటి వాళ్ళు శారీరకంగా కూడా ఉత్తమస్థాయిలో ఉంటారని నిరూపించడానికి ప్రయత్నం చేస్తాను.

మా ఊళ్ళో దాదాపు అందరి దొంగతనాలు జరిగాయి. కాని సు... తాతగారింటికి చస్తే పోరు దొంగలు. ఓ సారి పొరపాటున దొంగతనం చెయ్యడానికి వెళ్లారుట. గోడకి కన్నం తవ్వితే సరిగ్గా ఆయన మంచం కిందకి వచ్చిందిట. కన్నం తవ్వుతూన్నంతసేపూ పాము చెవులు పెట్టుకు వింటూన్న ఆ పెద్దమనిషి - అక్షరాలా 'పెద్ద' మనిషే ఆయన - దొంగాడు కన్నంలోంచి లోపలికి వచ్చేవరకు నిశ్శబ్దంగా పడుకొన్నాడుట; దొంగాణ్ణి మంచం బయటకు రానిచ్చి - దొర్లి వాడిమీదకు పడ్డాడుట, చప్పుడు విని కన్నంలో దొంగలు కన్నంలోంచే చీకటిలోకి కరిగిపోయారుట. ఆ దొంగాడికి కాళ్ళూ, చేతులూ 'ఫ్రేక్చర్' కావడంవల్ల ఆరునెల్లు - ఉద్యోగరీత్యా - పగలూ రాత్రీ కూడా బయటకు పోడానికి వీల్లేకపోయిందిట. అప్పటినుంచీ దొంగలు - ఎందుకయినా మంచిదని - ఆ చుట్టుపక్కల ఇళ్లు కూడా దొంగతనం చెయ్యడం మానేశారట.

లావుగా ఉన్నవాళ్లను పరిహాసం చేసే వాళ్లను చూస్తే నాకు పరమాసహ్యం. ఎందుకంటే; నిర్మాణాత్మకపథంలో ఆలోచించి; దేశాభివృద్ధికోసం ముందుకు సాగడానికి బదులు; లేనిపోని అసూయలు పెట్టుకొని అభివృద్ధినిరోధకులుగా తయారవుతూంటారు. మహాకవి గురజాడ ఏమన్నాడు? "కండ కలవాడేను మనిషోయ్" అన్నాడు. "దేశాభిమానం నాకు కద్దని ఒట్టి గొప్పలు చెప్పకోకోయ్" అన్నాడు. అవునండీ! ఊరికే గొప్పలు చెప్పకు లాభం ఏమిటి? నిజంగా దేశాభిమానమే ఉంటే లావెక్కడానికి శతవిధాల యత్నంచేసి చూపెట్టాలి.

ప్రతివాడూ లావెక్కవలసిన ఆవశ్యకతను పెద్దలందరూ గుర్తించారు; సామాన్య ప్రజకు గుర్తుచేశారు. లావెక్కడంలో ఉన్న ఆనందాన్ని గుర్తించవలసిందిగా ఆంధ్రప్రజానీకాన్ని నేను ప్రార్థిస్తున్నాను. నేను పుట్టినప్పుడు 30 పౌ బరువుండేవాణ్ణిట. ఇప్పుడు సుమారు 230 పౌ. బరువున్నాను రక్తమాంసాలలో క్షణక్షణానికి అభివృద్ధి కలుగుతూంటే కలిగే ఆనందం; మహాత్మ గాంధీప్రభృతులకి మానసికాభివృద్ధివలన కలిగిన ఆనందానికి ఏమాత్రం తీసిపోదని నా దృఢ విశ్వాసం. నాయీ విజ్ఞప్తి ఫలితంగా ఆంధ్రప్రజానీకంలో అతికాయుల; మహాకాయుల సంఖ్య విపరీతంగా పెరుగుతుందని; తత్ఫలితంగా - నేను - ధన్యుణ్ణవుతానని ఆశిస్తున్నాను. జైహింద్. జైభారత్. ★

# విజ్ఞానవీధులు

డాక్టర్

## "206. నిజమంటే?"

'జ్యోతిషము దెబ్బ తగుడ్డదుతావు ఇక నిజమంటే ఏమిటి?' అని ప్రశ్నించేరు '199 జ్యోతిషమ్ము' లో 'డాక్టర్' (ఆంధ్ర సచిత్రవార పత్రిక, 2-2-1955).

"సత్యాన్వేషణ గురుతర కష్టకార్యం మానవుడు ఒకనాడు 'సత్యం' గా భావించినవి, జ్ఞానాభివృద్ధితో వాటి 'సత్యత్వాన్ని' కోల్పోయినాయి ఏ జ్ఞానభాగం ఈనాడు ఆరాధ్యంగా భావింపబడుతూందో, దేనికి వినియోగపడుతూన్న తర్కమార్గమే సర్వత్రా వర్తిస్తుందని కొందరు భావిస్తున్నారో, ఆ జ్ఞానభాగంలోనే సత్యాసత్య విచారణ పూర్తికాలేదు. 'ఎలక్ట్రానొక సూక్ష్మకణం. సత్యమా?' 'జౌ' నంటున్నారు. 'ఎలక్ట్రానొక తరంగ సమూహం. సత్యమా?' అదీ 'జౌ' నంటున్నారిప్పుడు. రెండు పరస్పర విరుద్ధ లక్షణాలు ఎలక్ట్రానుకి ఆపాదింపబడ్డాయి వాటిలో ఏవి సత్యమైనవి? ఆ ప్రశ్నకు విజ్ఞాని కచ్చితంగా జవాబు చెప్పలేడు కొన్ని ప్రయోగాలలో చులకని బండి చక్రాన్ని ఎలక్ట్రానుల ప్రవాహం దొర్లించుకొని పోతుంది. ఎలక్ట్రానుకి కణస్వభావం లేకపోతే స్పష్టంగా కంటికి కనిపిస్తూన్న ఆ ప్రయోగం సాధ్యం గాదు. మరి కొన్ని ప్రయోగాలలో తరంగకోశాలవలె ఎలక్ట్రానులు ప్రవర్తిస్తాయి కాంతి తరంగాలు వివర్తనం (*diffraction*) చెంది కొన్ని పరిస్థితులలో ఏకకేంద్ర వృత్తాకార వలయాలను కలిగించినట్లే, ఎలక్ట్రానుల ప్రవాహం సైతం వివర్తన వలయాలను కలిగిస్తుంది. ఆ ప్రయోగఫలితాన్ని స్మరించినప్పుడల్లా 'ఎలక్ట్రానులు కణాలు' అను భావం సత్యంకాదని చెప్పక తప్పదు కాని, అవిధంగా విజ్ఞానులంటున్నారా? ఎలక్ట్రానులకు కణలక్షణాలు, తరంగ లక్షణాలు కూడ ఉన్నాయని అంగీకరించేరు. మనం చేసే ప్రయోగంలో ఏ లక్షణాలు ప్రస్ఫుటం కాగలవో అవి మాత్రమే వ్యక్తమౌతా యన్నారు అయితే ఎలక్ట్రాను కణమా? తరంగకోశమా? ఏది నిజం?

"భౌతిక విజ్ఞానంలో ఒక ప్రత్యేకమైన భావపథాన్ని ఆశ్రయించడానికి అలవాటు పడ్డాము. ఆ మార్గాన్ని పోతూన్నప్పుడు పరస్పరం విరుద్ధంగానున్న అభిప్రాయాల సామోదించడానికి మన తర్కాన్ని దంపు కొంటాము 'కాంతి తరంగాలు', 'కాంతి కణాలు': పరస్పర విరుద్ధభావాలు. కాని, రెండిటిని ఆమోదించక తప్పగు. ఒక లోహతలంపై పడిన కాంతికిరణాలు లోహ పరమాణువులలో పరిభ్రమిస్తూన్న ఎలక్ట్రానులను ఎగురగొట్టుతాయి. ఆ ఎలక్ట్రానులను సేకరించి విద్యుత్ ప్రవాహంగా మార్చవచ్చును. లోహతలంనుండి ఎలక్ట్రానులు బహిర్గమించు వేగం లోహతలంపై పడి వాటి నూడగొట్టిన కాంతి తరంగాల అల పొడవుపై ఆధారపడిఉంటుంది. అలపొడవు తక్కువైనకొద్దీ తరంగాల శక్తి ఎక్కువౌతుంది. దానితోపాటు, లోహతలంనుండి విడివడు ఎలక్ట్రానులవేగం ఎక్కువౌతుంది. ఈ సంఘటనను 'కాంతి జనక విద్యుత్ ఫలితం' (*Photo electric effect*) అంటారు. కాంతి కిరణాలు కణసముదాయాలన్న భావాన్ని అంగీకరిస్తే గాన్ని పై ఫలితం సమర్థనీయం గాదు

"మరొకదృగ్విషయముంది. ఒకదీపంనుండి రెండుమార్గాలలో బయలుదేరి, ఒకదానిపై నొకటి పడిన కాంతికిరణపుంజాలు సంఘట్టన (*interference*) నొందుతాయి. అప్పుడు, కాంతికిరణాల కలయికచే మధ్యమధ్యను చీకటి ఏర్పడుతుంది. ఇది సంధించడానికి కారణం కాంతికిరణాల తరంగస్వభావం అని చెప్పకతప్పదు. అయితే, కాంతికిరణాలు కణసమూహామా? తరంగ సముదాయమా? ఏది నిజం? నిజమంటే ఏమిటి?

"భౌతిక విజ్ఞానంయొక్క పరిమితత్వాన్ని ఆకళించుకొన్న మేధావు లెన్నడు వారికి తెలియని విషయంగురించి చులకనగా ప్రస్తావించరు. కొన్నికొన్ని రంగాలలో విజ్ఞాని తన అజ్ఞానాన్ని అంగీకరిస్తాడేకాని, తను పరిశ్రమచేసి నిర్ణయించని దే విషయాన్ని ఖండించడు. అది ఉత్తమ భౌతికవిజ్ఞానుల ప్రత్యేక లక్షణం. పరమాణు కేంద్రక విజ్ఞానంలో ఉన్నతస్థానమందిన రాబర్ట్ ఓపెన్‌హైమర్ అన్నాడు: "చిన్న ప్రశ్నలుగానున్న వాటికికూడ జవాబు చెప్పలేని స్థితిలో నున్నాము; లేదా, జవాబు చెప్పకలిగినచో అది డొంక తిరుగుడుగా ఉంటుంది. మాటకి, 'ఎలక్ట్రాను ఒకే స్థానంలో ఉంటుందా?' అంటే 'లేదు' అనాలి. 'కాలంతో దాని స్థానం మారుతుందా?' అంటే 'లేదు' అనాలి. 'ఎలక్ట్రాను స్థిరంగా ఉందా?' అంటే 'లేదు' అనాలి. 'అది గమనంలో ఉందా?' అంటే 'లేదు' అనాలి. మరణానంతరం మానవుని ఆత్మవిషయమై బుద్ధుని ప్రశ్నించినప్పు డిట్టి జవాబులే బుద్ధు డిచ్చేడు." 1 అది భౌతికవిజ్ఞానంయొక్క ప్రస్తుతస్థితి"

1 *Oppenheimer : Science and Cmomon understanding,*

ఇవి శ్రీ వసంతరావు వెంకటరావుగారి (6-4-55, నాటి ఆంధ్రవారపత్రికలోని) మొదటి ఉత్తరంలోనుంచి మేము వెనక పెట్టిన వస్తువు. జ్యోతిషము రైటు అయినప్పుడు అవుతుంది, కానప్పుడు కాదు. కనక జ్యోతిషము దెబ్బ గుడ్డదుతావు. ఇక నిజమంటే ఏమిటి? అని మేము వేసిన ప్రశ్నలో 'ఇక నిజమంటే ఏమిటి?' అన్న భాగాన్ని వేరతీసి దానికీ జవాబును వెలయించారు వెంకటరావుగారు.

వారు వివరించినది ఎలక్ట్రానునుగురించి. ఎలక్ట్రాను మనకు నేటికి తెలిసిన కనీసపు కణం. అంతకన్నా పెద్దది—మీ సాను ప్రోటానులను మినహాయిస్తే—పరమాణువు.

ఎలక్ట్రాను విషయంలో స్ఫుటంగా [illegible] బడే తరంగగుణం పరమాణువు దగ్గరకు వచ్చేసరికి కొంత మసక మసక అవుతుంది. అణువుల సంగతి చూస్తే తరంగగుణము ఇంకా పలచనైపోతుంది. కనక అణుసంఘముల వర్తనమును పరిశీలించేటప్పుడు వైజ్ఞానికులు తరంగ గుణాన్ని లెక్కపెట్టరు. ఇక బృహత్ప్రపంచ పరిశీలనలో ద్రవ్యముయొక్క తరంగగుణము లెక్కయే లేదు. సూక్ష్మ సూక్ష్మతర ప్రపంచంలోని అనిర్దేశిత్వమును బృహత్ప్రపంచములోని జ్యోతిషానికి ఆవేశింపజేయుట వైజ్ఞానిక దృష్టియే నంటారా వెంకటరావుగారు?

ఎలక్ట్రానుల సంగతినే గమనింపుడు. X - కిరణాల క్షేత్రములో ఎలక్ట్రానులు యాంటీకాథోడుకి తగిలి వాటి గతిజ శక్తి X - కిరణములుగా మారుతున్నది. ఎలక్ట్రానుల గతిజ శక్తీ, X కిరణాల అత్యధిక పౌనఃపున్యమూ లెక్కకి సరిపో[illegible]న్నాయి. ఎలక్ట్రాను వివర్తన కెమెరాలో ఎలక్ట్రానులు తరంగ గుణమును సూచించు చుసే యశదగంధకిదపు తెరపైపడి [illegible]పించుచున్నవి; అయస్కాంతము [illegible] పక్కకు తెచ్చినచో కొంత దారి తొ[illegible]చున్నవి. కనుక ప్రయోగ విజ్ఞానములో [illegible] ఎలక్ట్రాను తరంగమా కణమా తె[illegible] పోవుటవల్ల - కొంప మునుగు ఏదీ రాలేద[illegible] వెంకటరావుగారు ఎరుగరా? నిజమంటే ఏమిటి? అని ఒక పెద్ద సమస్యగా ముంద పెట్టుతున్నారు వెంకటరావుగారు

(40-వ పేజీ చూడండి)




## 32

వరదరాజు టీకొట్లో గల్లాపెట్టెదగ్గిర నిలబడి లోపలికొచ్చే ప్రవాహంలాంటి జనసమూహాన్ని ఆహ్వానిస్తున్నాడు. ఏడుకొండలు టిఫిన్, టీ అందిస్తున్నాడు. టీకొట్టు పెట్టినప్పణ్నించీ ఇదేవరస. అదివరకు ఈగలు ముసురుతూవున్న బేరం ఇప్పుడు జోరుగా సాగుతోంది. వరదరాజు తీరిక లేక సతమతమౌతున్నాడు. అతని కీబేరం అక్కడకూర్చుని చిల్లరంతా పోగుచేస్తూవుండడం, లెఖ్ఖ పెట్టడం, ఇవ్వవల్సినవారికివ్వడం మహా చెడ్డ చిరాకుగా వుంది.

ఉదయం పదింటివరకూ డబ్బులుతీసుకోటంకూడా అష్టావధానమే. టీకొట్టు ఇరుకు. సరిగ్గా ఇరవైసీట్లున్నాయి. ఎప్పుడు చూసినా పాతికమంది ఉంటూనే వుంటారు. ఈ చివరించి ఆ చివరదాకా జనం; ఒక టేగోల; టీ, బిస్కట్లూ చపాతీ అని.

వరదరాజు రూపాయికి చిల్లరఇస్తూ, టీ అడిగేవాళ్ళఆర్డర్ లని టీకలిపేవాడికి చెబుతున్నాడు. ఏడుకొండలు బిల్లులు చెబుతున్నాడు. మాటిమాటికీ సిగరెట్టు వెలిగించి పొగ వొదుల్తూ, యజమాని స్థానంలోనున్నప్పుని, రాబడీ ఖర్చూ లెఖ్ఖవేస్తూవుండడం వరదరాజుకి ఎందుకో ఊపిరాడనట్టున్నది. అతని కీపరిశ్రమ కొత్తగా వుంది. తల తిరుగుతోంది.

వరదరాజు రిస్టువాచీవంక చూశాడు. తొమ్మిదింబావు అయింది. పూరీ పాసెంజర్ పెద్దగాకూస్తూ వొచ్చింది స్టేషన్లోకి.

ఉదయపు ఎండ టీకొట్టులోకి పాకుతోంది. లోపల టీ తాగే వాళ్లు చాలామంది చవకబారు మనుషులు—పెద్దమనుషులదృష్టిలో. ...నవున్న వాడికి కడుపు నిండుతుంది టీషాపులో. అణామాత్రం వున్న రిక్షావాలా, వేడి టీనీళ్లు తాగి సంతృప్తిపడుతున్నాడు. ...ంగా రికార్డు సంగీతం వినిపిస్తున్నారు, టీషాపువాళ్లు. అదొక ...దం.

ఎవరో చింపిరిజుట్టు అతను కడుపునిండా తిన్నాడు బిల్లు ...వ్వాల్సివొచ్చేసరికి, చల్లగా జారుకుంటున్నాడు. ఏడుకొండలు అతన్ని పట్టుకున్నాడు. చొక్కా కాలరు పట్టుకుని, లాక్కొచ్చాడు వరదరాజుదగ్గిరకి.

"చూశావా? జేబులో దంబిడీలేకండా పొట్టనిండా తినేసి దూసుకుంటున్నాడురా!" అన్నాడు ఏడుకొండలు అతన్ని తన్నటానికి సిద్ధమై

వరదరాజు అతన్ని కిందనించి పైదాకా చూశాడొకసారి.

ఆ అభాగ్యుడి చింపిరిజుట్టుమీద ఎండపొడపడి రాగి రంగులో మెరుస్తోంది. గుడ్డలు నల్లగా మురికి పట్టివున్నాయి. పైజామా మడమలదగ్గిర చీలికలై వేళ్లాడుతోంది. చొక్కా భుజాలదగ్గిర చినిగిపోయింది. గడ్డం పెరిగింది "మీరేంజేసినా సరే" అన్నట్టు చూస్తున్నాడు దీనంగా.

వరదరాజు "వొదలరా వాణ్ణి" అన్నాడు ఏడుకొండలుతో.

ఏడుకొండల్ని ఈ ఐదునిమిషాల్లో లోపల టీ కావల్సినవాళ్లు పది పన్నెండుమంది పల్చారు. అతను లోపలికెళ్ళాడు.

వరదరాజు "నీదేవూరోయ్?" అని అడిగాడు, డబ్బులివ్వని నేరస్థుణ్ణి. "ఈవూరే" అన్నాడు అతను.

"ఏం ఈపనిచేశావు?" అని ప్రశ్నించాడు ప్రొప్రయిటరు.

ప్రొప్రయిటరుగారి శాంతవైఖరి అభాగ్యుడికి ఆశ పురిగొల్పింది. తన్నులు తప్పుతాయి అనుకున్నాడు. వరదరాజు ఈలోగా డబ్బులిచ్చేవాళ్లదగ్గిర చిల్లరతీసుకుని గల్లాలో పడేసుకుంటూ, "డబ్బులేకండా తింటే తంతారని తెలీదంట్రా" అని ప్రశ్నించాడు.

"ఎందుకు తెలీదు? ఆకలిగావుంది .. తినేశాను తర్వాత తంతేఏం, చంపితేఏం?" అన్నాడు అతను.

వరదరాజు ఆ ఇరుకు జీవితాన్ని, హోటల్నీ, మనుషుల్నీ, అన్నిట్నీ ఒక్క క్షణం మరిచిపోయి, పకపక నవ్వాడు, సహజంగా. ఆకలంటే అతనికి బాగా తెలుసు నవ్వాగాక, "వెళ్లు." అని మళ్ళీ ఏదో ఆలోచించి, "నీకేం పనిలేదా?" అని ప్రశ్నించాడతన్ని.

"పని దొరకలేదండి. ఆకొన్నల్లయిందండి .."

"ఏం పని చేస్తావు?" అని అడిగాడు వరదరాజు, బిల్లులకి చిల్లర ఇస్తూ తీసుకుంటూనే. వీళ్ళద్దరిచుట్టూ పదారుగురుకూడారు, ఈ సంభాషణవింటూ. ఆ అభాగ్యుణ్ణి టీ కొట్టు ప్రొప్రయిటర్ తంతే చూడాలనివుంది వాళ్ళకి. అదొక రకం కోర్కె కుస్తీలు చూసినట్టు, స్టంటు సినిమాల్లో దెబ్బలాటలు చూసినట్టు—అదీ వొక ఆనందం కొందరికి వరదరాజు వాణ్ణి తన్నకపొయ్యేసరికి ప్రేక్షకులకి ఆశాభంగం కలిగింది. ఇంకేమౌతుందో అని చూస్తున్నారు వాళ్లు.

"నేను సైకిల్ రిక్షా తొక్కేవాణ్ణి ఒకనాడు రిక్షా రోడ్డుమీద వొదిలి, బాడుగకోసం పక్కసందుకు వెళ్ళొచ్చాను తిరిగొచ్చి చూస్తే లైటూ సీటూ ఎవడో కొట్టేశాడు. తర్వాత నాకెవరూ సైకిల్ అద్దెకివ్వలేదు "

వరదరాజు, అతని స్థితినిగురించి ఆలోచిస్తున్నాడు. "మా షాపులో పని చేస్తావూ? ?" అని ప్రశ్నించాడు.

"చేస్తానండి! ఏంపని?..." అన్నాడు అభాగ్యుడు ఆశగా.

వరదరాజు ఏడుకొండల్ని పిల్చి, "ఇతన్ని లోపలికి తీసుకెళ్ళరా ఏదో పని చెప్పు" అన్నాడు.

అభాగ్యుడు కృతజ్ఞతతో లోపలికి వెళ్ళాడు.

వరదరాజువైపు చిత్రంగా చూస్తూ నుల్చున్నాడు, ఏడుకొండలు, "ఇప్పటికే పాతికమందికి వుండార్రా, పెద్ద సత్రంలాగా. ఇంకా ఎంతమందిని చేరేస్తావు?" అన్నాడు టేబిల్‌కి ముందు నిలబడి, వేడి టీ కలుపుకొచ్చి సగం వరదరాజుకిచ్చి.

వరదరాజు టీ గ్లాసు తీసుకుంటూ, "తిన్నియ్యరాదంట్రా? ఇందులో వొచ్చేది వాళ్ళకి సరిపోద్ది.. మనకి రాకపోయినా ఫర్వాలేదు. నీకు మొదలే చెప్పలేదురా?.. " అన్నాడు నవ్వుతూ

"ఏడు వుంటాడుర ? రేపు ఈపాటికి కడుపునిండితే లేచిపోతాడు" అన్నాడు ఏడుకొండలు, సంశయంగా

"పోతే పోని పొయ్యేవాణ్ణి వుండమనగ్గు?" అంటూ వరదరాజు టీ గ్లాసు గుక్కలో ఖాళీచేసి, బయల్దేరాడు బైటికి అప్పటికి పదయింది;

"అప్పుడే ఎక్కడికిరా! బేరం జోరుగావుంటే!" అన్నాడు ఏడుకొండలు అతని కా వ్యాపారంలో లాభం ఆర్జించాలని, జాగ్రత్తగా వుండాలనీ కోరిక వరదరాజుకి అదేమీ పట్టినట్టు లేదు "పోరా! నీ బేరం నువ్వూనూ! నువ్వే కూర్చో గల్లాకాడ. నే నుండలేనురా ఈ గోలలో. చెవులు దిమ్మెక్కిపోతున్నాయి" అంటూ వరదరాజు, గల్లాముందునుంచి లేచి బైటి కొచ్చేశాడు. రోడ్డమీదికి వొచ్చి సిగరెట్టు వెలిగించేసరికి అతని కెంతో ఆనందంగా స్వేచ్ఛగావుంది చాలా విశ్రాంతిగా వుందతనికి

అతను మెల్లిగా ఆలోచిస్తూ గవర్నర్‌పేటవైపు నడవసాగాడు.

రైల్వేస్టేషన్ అవతల పేవ్‌మెంటు పక్కనే గుబురుచెట్టు కింద, హస్తసాముద్రికం చెప్పే జ్యోతిష్కుడు తన భవిష్యత్ ఏమిటో తనకే తెలీక ఉసూరుమని కూచునివున్నాడు అతని పక్కనే మైనపు పట్టామీద రకరకాల వేర్లూ, పొడులూ పరిచి, శతమూలికాది లేహ్యం, సర్వరోగచింతామణీ అమ్ముతున్న ఎముకలపోగు ముసలాడు దగ్గిదగ్గి కళ్ళంబడి నీళ్లు పెట్టుకుంటున్నాడు అతని దగ్గుకి ఆ మంగుల్తా మూలికలూ ఏమీ పనిచెయ్యవులా గున్నది వేడిగా టీ తాగాలని చాలాసేప ట్నించి చూస్తున్నాడు. ఎవడూ వొచ్చి అణాకైనా మందుపొట్లం కొనలేదు.

ఆ పక్కనే కోటిగాడు, యథాస్థానంలో నవారు ఆట సాగిస్తున్నాడు. ఏదో కొద్దిగా సంపాయించినట్టే వున్నాడు వైఖరి చూస్తే.

వరదరాజు పరాకుగా వీళ్లందర్నీ చూస్తూ వెళ్తున్నవాడు, "గురూ! ఇటురా!" అని కోటిగాడు పిల్చేసరికి వెనక్కి తిరిగి వొచ్చాడు

"నేను పనుండి యెల్తున్నారా! మళ్ళీ వస్తా" అంటూ మళ్ళీ నడవసాగాడు, కోటిగాడి సమాధానానికేనా ఎదురుమాడకండా

ఆ వానకాలపు చివరి రోజుల్లో ఎండ హాయిగావుంది. చలికాలం ప్రవేశించబోతోంది కృష్ణ నిండుగా ప్రవహిస్తూంది.

వరదరాజుకి పేవ్‌మెంటులమీద పడుకునివున్న అనాధులైన కుర్రాళ్లూ, రోగులూ కనిపించారు ఏమిటీ తారతమ్యం! ఎందుకిట్లా? మృత్యుంజయశాస్త్రి వసంతంతోటి అప్పుడప్పుడంటుండేవాడు, "అదంతా ఖర్మలే, పిచ్చిదానా," అని అదా? ఏమిటి? అని ఆలోచిస్తున్నాడు.

అతనికి తన వెనకటి జీవితానికీ, ప్రస్తుత పరిస్థితికి ఎంతకీ సమన్వయం కుదరటంలేదు. ఏదో అలజడి మనస్సులో. ఆ రోజుల్లో తను ఎక్కువగా ఆలోచించేవాడే కాదు. అప్పుడు ప్రశ్నలంటూ ఉండేవే కావు ఎవడిదేదో జాగ్రత్తగా కాజేసి నలుగురూ పంచుకుని సాయంత్రానికి తాగి కాసిని మెతుకులు తిని బ్రాకెట్ కంపెనీ దగ్గిర నిలబడి తన గ్యాంగువాళ్లతో మాట్లాడుతూ, రాత్రికి వసంతం దగ్గిరకి చేరినప్పుడు ఈ అశాంతీ అలజడీ వుండేవికావు.

ఇప్పుడు అన్నీ ప్రశ్నలే నిజానికి డబ్బుతో, ఎంతపనైనా చెయ్యొచ్చు ఛా ఛా! ఈ పిచ్చి ఆలోచనలు పనికిరావు. తన కున్న డబ్బునంతా తనిప్పుడు వినియోగించుకోలేకండా వున్నాడు. దానికి టీ షాపు చాలదు. ఇంకేమన్నా చెయ్యాలి.

వరదరాజు ఇలా ఆలోచిస్తూ బందర్‌రోడ్‌లో వున్న తన డాబాగదికి వొచ్చాడు. తలుపుతీసి లోపల చాపమీద పడుకుని, సిగరెట్ వెలిగించాడు. కిటికీలోనుంచి, దొడ్లో బ్రహ్మచారిలా వొంటరిగా నిలబడివున్న కాయల్లేని కొబ్బరిచెట్టూ, దాని ఆకుల మీంచి జారుతున్న సూర్యరశ్మి అతని మనస్సు కెంతో ఆహ్లాదం కలిగిస్తున్నాయి

అతను లోపలి కెళ్ళిన పదినిమిషాలకల్లా, ముద్దుటగా అందంగా వున్న మూడేళ్ల కుర్రాడు ఒకడు 'తై తక్కతై' అని నడుస్తూ, పడుతూ లేస్తూ గది మెట్లెక్కి లోపలికి వచ్చి, వొచ్చీ రాని భాషలో, "మామా, మామా, బొమ్మ బొమ్మ" అని గంతు సాగాడు వరదరాజు శూన్యప్రపంచంలో పడ్డాడు.

ఈ గదిలో అద్దెకి ప్రవేశించిన వారంలో వెనకఇంట్లో కాపరం వున్న దంపతుల ఏకైక పుత్రుడైన ఈ కుర్రాడి స్నేహం ఒకనాడు వరదరాజుకి అకస్మాత్తుగా లభించింది. ఒకనాడు వరదరాజు గదిలో కూర్చుని రోడ్డువంక చూస్తూవుంటే ఆ కుర్రాడు రోడ్డు నడిమధ్యకిపోయి, నుల్చుని ఏమిటో చూస్తున్నాడు. వెనక నించి సైకిళ్ళూ, బండ్లూ వొస్తున్నాయి వరదరాజుకి భయమేసింది. ఏమిటి ఎవరూ, అనే సంశయమన్నా లేకండానే అతను గది నుండి బయటికివొచ్చి కుర్రాణ్ని లోపలికి లాక్కొచ్చాడు. లోపలి భాగంలో వున్న ఆ కుర్రాడి తల్లి, గొడ్డి వాకిలిగుండా చూస్తూంది. కుర్రాణ్ణి, "చిన్నా, చిన్నా" అని పిలుస్తోంది కుర్రాడు. "ఓ" అని ఏడ్పు లంకించుకున్నాడు

వరదరాజు గ్రహించాడు కుర్రాడు, ఈ యింట్లోవాడేనని మెల్లిగా కుర్రాణ్ణెత్తుకెళ్లి, గొడ్డిగుమ్మందగ్గిర వొదిలిపెట్టి, "రోడ్డు మీదకి వొదలకండి బండ్లూ, అవీ తిరుగుతూంటాయి" అనేసి, గదిలోకి వొచ్చేశాడు అలవాటుప్రకారం ఆమెకేసి చూశాడు. నిరాడంబరమైన ఆమె సాంసారిక వైఖరీ, శాంతమైన ఆ ముఖమూ వరదరాజుకి ఏదో పూజ్యభావాన్ని కలగజేశాయి

ఆరోజుతర్వాత ఆకుర్రాడు కొద్దికొద్దిగా వరదరాజుకి పరిచయమైపోయాడు వరదరాజు గదిలో అడుగు పెట్టిన చప్పుడు వింటే ఇంట్లో ఎక్కడో ఆడుకునేవాడల్లా "మామా మామా" అనుకుంటూవొచ్చి వరదరాజు కాళ్లు పెనవేసుకుని తిరుగుతాడు. గదంతటా సర్వస్వతంత్రంగా కలయ తిరిగేసాడు ఒకనాడు గాజు గ్లాసు పగలగొట్టి, వరదరాజు ఏమంటాడో అని ముందే ఏడవసాగాడు కుర్రాణ్ని సముదాయించేసరికి వరదరాజుకి తల ప్రాణం తోకకువచ్చింది.

ఇప్పుడూ అంతే. కుర్రాడు అమాయకంగా నవ్వుతూవొచ్చి వరదరాజు పొట్టమీద కూర్చుని, "మామా, మామా, బొమ్మ, బొమ్మ" అంటూ గునుస్తూ, జేబులు వెతుకుతున్నాడు వరదరాజుకి కుర్రాడిభాష బాగా అర్థం అవులేదు. నిన్న, "బొమ్మ తెస్తాలే" అన్నాడు, ఏదో మాటవరసకి. కుర్రాడికామాట బాగా జ్ఞాపకం వున్నది వరదరాజేమో తన టీషాపు గొడవలో మర్చిపోయినాడు.

"ఇంటికిపోయి నాక్కాస్త తొడుక్కురా, బజారువెళ్ళి కొనుక్కుందాం, ఏం?" అంటూ వరదరాజు కుర్రాణ్ణి సముదాయించాడు. కుర్రాడికి ఇతరులు చెప్పేమాటలు బాగా అర్థమాతున్నాయి మాట్లాడటం బాగారాలేదు కొన్ని సౌజ్ఞలువచ్చు. "బొ గొ.." అంటూ బంతిలా ఎగురుతూ అమ్మదగ్గిరకి పరిగెత్తాడు.

పదినిమిషాలకి సుబ్రాడు చిన్న లాగూ తొడుక్కుని అందంగా తలదువ్వుకొని వచ్చాడు వరదరాజు సుబ్రాణ్ణెత్తుకుని తలుపు తాళం వేసి బజారుకొచ్చాడు ఒక ఫ్యాన్సీ షాపులో సుబ్రా[illegible] బొమ్మలన్నిటిన్నీ తీసి చూపించాడు సుబ్రాడికి నచ్చిన బొమ్మ [illegible]యిపెట్టి కొనిచ్చాడు సుబ్రాడి అమాయకమైన మొహంమీద ఆ నిమిషాన వెలిగిన ఆ ఆనందం చూసి వరదరాజుకి రెట్టింపు ఆనందం [illegible] ఆ సుబ్రాణ్ణి ముద్దెట్టుకున్నాడు సుబ్రాడు మొహం చీద[illegible]ట్టి, మీసాలు లాగాడు

"గుచ్చుకుంటున్నాయా చిన్నా!" అంటూ పకపక నవ్వాడు వరదరాజు

తన కీస్నేహం ఏమిటో వరదరాజుకి బోధపడలేదు ఈ అవ్యాజమైన వాత్సల్యం అతని కెంతో విశ్రాంతినిస్తోంది ఆ సుబ్రాడితో వ్యక్తమయ్యే అనంత చైతన్యం నవ్వూ, తనతోటి స్నేహం, [illegible]ర్యం గొల్పుతోంది అతనికి

వరదరాజు తిరిగి గదికివచ్చి సుబ్రాణ్ణి ఇంటికి పంపించేసి, సీసాతీసి దొంగసారా గ్లాసులో పోసుకుని తాగి, భోజనానికి బయల్దేరి వెళ్ళాడు

## 33

జయకి హిస్టీరియాకి వైద్యం చేయించడం జానకమ్మగారికి ఇష్టం వుండిగాదు. ప్లీడరుగారికి ఇష్టం లేదు లోలోపల జయను [illegible] అని భావించటమే మానేశారు వాళ్లు ఒక్క రమణమ్మకే [illegible] వైద్యం చేయించడం ఎందుకో

త్రయంబకరావు ఎవర్నీ అనుమతి అడగకుండానే వెళ్ళి డాక్టర్ని తీసుకొచ్చి చూపించాడు ఆయన విజిటింగ్ ఫీజు పుచ్చుకుని వైద్యం చేస్తున్నాడు ఇంక వొద్దని ఎలా అనడం! అదీ ప్లీడరుగారి బాధ! జయకేమో, అంతా అయోమయంగావుంది నెలరోజుల నుంచీ కొద్దిగా జ్వరం వస్తూండడంవల్ల ఆమెను మేడమీదగదిలో మకాం పెట్టారు ఆమెకు శుశ్రూష చేసే పని రమణమ్మ నెత్తిన వేసుకుంది

ఒకనాడుదయం కాఫీ తీసుకెళ్ళి మరదలికిచ్చి ఆమె పక్కనే కూర్చుని, "పిచ్చిపిల్లా, ఏమిటి ఎప్పుడూ ఆలోచిస్తూ కూర్చుంటావు?" అని అడిగింది, నుదుట చెయ్యివుంచి

జయ నీరసంగా విశాలమైన కళ్లు తెరచి ఇంటి కప్పు వంక చూస్తోంది ఆ గదిలో ఆమె మంచం, గోడకు బుద్ధుని శాంత ప్రసన్నమైన రూపచిత్రం తప్ప ఇంకేమీ లేవు ఒక కిటికీలో నుంచి దొడ్లో బాదంచెట్టూ, గానుగచెట్టూ కనిపిస్తాయి క్రితం రాత్రి కురిసిన వర్షానికి దొడ్డంతా పచ్చగా కన్పిస్తోంది, గడ్డి ఏపుగా వుండడం మూలంగా, వాన తుంపరలు పచ్చిగడ్డి కొనల మీద ఎండ కాంతికి రవ్వల్లా మెరుస్తున్నాయి

జయ వాడిపోయిన శరీరం చూసి రమణమ్మకి జాలీ, కరుణ కలిగాయి. జయ ఆమె వైపు తిరిగి, "ఆలోచనేం వుందండి నేనొచ్చి [illegible]ల్లయింది, నాన్నా రాలేదు, అన్నయ్యా రాలేదు [illegible]ం ముక్కయినా లేదు." అంది దిగులుగా

రమణమ్మకి తెలుసు రంగయ్యగారి స్థితి శేషాద్రిరావుగారు చెప్పాడు ఆమాట జయకి చెప్పడం ఉచితం కాదని ఊరుకున్నది. "రాస్తారులే అమ్మా. ఏం పనిలోవుండిపోయినారో ఏమో" అని సముదాయించింది.

ఇంతలోనే కిందనుంచి కేక వినిపించింది; రమణమ్మ వెళ్ళిపోయింది.

అరగంట తర్వాత మందివ్వటానికి ఆమె తిరిగి వచ్చినప్పుడు జయ దిండుకానుకుని కూర్చునివుంది డాక్టర్ చెప్పిన మాటలు విన్నదగ్గిరనుంచీ జయని ఒక ప్రశ్న అడగాలని రమణమ్మకి కుతూహలంగా వుంది

ఆమె జయపక్కనే కూర్చుని, "అమ్మాయీ, నే నొక్క సంగతి అడుగుతాను చెబుతావు?" అని ప్రశ్నించింది ఆప్యాయంగా

జయకి రమణమ్మఅంటే భయంలేదు ఆమె జయని ఎన్నడూ ఏమీ అనలేదు ఉరిమి చూడలేదు అత్తగారంతయితే, ఆడబిడ్డ ఎంతయివుంటుందో అని మొదట భయపడ్డది జయ కాని ఆ భయానికి ఆస్కారం లేదని త్వరలోనే తెలుసుకుంది "ఏమిటో అడగండి ఎందుకు చెప్పనూ?" అంది మెల్లిగా

రమణమ్మ ఒక్క నిమిషం మెట్లవంక చూసి, ఎవరూ రావటం లేదని ధ్రువపర్చుకుని, "నువ్వేదో భయపడ్డావని, అందువల్లే ఇట్లా పడిపోతున్నావనీ డాక్టర్ చెబుతున్నాడు నిజమేనా? దేన్ని చూసి భయపడ్డావు? నాకు చెప్పు!" అంది, మరదలు తల నిమురుతూ

జయ కొన్నేపు ఆలోచిస్తూనే వున్నది పది నిమిషాలైనాక నిదానంగా వారాల సుబ్రాడు చెప్పిన కథ, అన్నగారు వేసిన బొమ్మ, అదిమొదలు భర్త అంటే ఏర్పడ్డ భయమూ, దానికితగ్గట్టే పైకంకోసం నాన్నా మామగారూ ఘర్షణ పడడమూ, అంతా చెప్పి, "ఆరాత్రి - వారు, వొచ్చి నా యెదుట నిలబడేసరికి నా కొక్కసారే ఇవన్నీ జ్ఞాపకం వొచ్చాయి వెనకటికి మల్లేనే పడిపోయినానండి" అంది

రమణమ్మ శ్రద్ధగా వింది ఆమెకి జయ భీతికిగల కారణం అర్ధమైంది. "పిచ్చిదానా! నాతమ్ముడంత మంచివాడు ఎక్కడన్నా వున్నాడుటే? నీ వెర్రిగాకపోతే ఆ వారాల సుబ్రాడి గాథకీ, నీ మొగుడుకీ పోలిక పెట్టుకుంటావా? ఒక్క సంగతి వింటే నీకే తెలుస్తుంది, నిన్ను! " అంటూ ఆమె చప్పున లేచి మెట్లదగ్గర్కి వొచ్చి ఎవరూ లేరని ఇంకోసారి స్థిరపరచుకుని వొచ్చి, "నిన్ను ఇక్కడికి తీసుకురావటానికి అసలు వాడే కారణం. వాడేగనక అమ్మా నాన్నమాట వినివుంటే నువ్వు ఇక్కడ వుండేదానివే కావు. త్రయంబకరావు ఒక్క చీమ హింసపడితేనూ సహించలేడు. అతి మెత్తని మనసు వాడిది" అని, తానూ తన తమ్ముడూ, చేసిన పన్నాగం అంతా జయకి వినిపించింది. "చూశావా జయా వాడేమో నువ్వంటే ముచ్చటపడిపోతున్నాడు నువ్వు జబ్బు పడ్డావన్న దగ్గిరనించీ, వాడు బెంగతో డాక్టర్ చుట్టూ తిరుగుతున్నాడు ఇట్లు మానుకో, బాగా ఆలోచించు, వాణ్ణి చూసి భయపడవల్సిన అవసరం లేదు" అన్నది

జయకి ఈ వివరాలు విన్న తర్వాత ఎంతో భారం తీరిపోయినట్టయింది. మొగుడంటే భయం తగ్గింది "నిజమేనండి వొదినగారూ ఆలోచించటమేముంది .. " అంది, కొంచెం సిగ్గుపడుతూ,

రమణమ్మ లేచి నిలబడింది "కొన్నేపుండి వాడొస్తాడు. [illegible] పలకరించు?" అని, "నేవెళ్లొస్తా మళ్ళీ మధ్యాహ్నం వొస్తాను" అంది వెళ్తూ

జయ కళ్ళు[illegible] చూస్తూ ఆలోచిస్తోంది, ఆమె కళ్ళ[illegible] త్రయంబకరావు శాంతమైన వర్చస్సూ, నవ్వుతున్న[illegible] [illegible]డాయి.

# 34

వరదరాజు టీషాపు నాలుగు నెలలనుంచీ అమోఘంగా సాగుతున్నది. ధర్మ సత్రంలా అతని అనుచరులూ ఇంకా పనిలేని ఇతరులూ ఇష్టం వొచ్చినట్టు తింటున్నారు. ఎవరూ దాని రాబడి ఎంతో ఏమిటో ఆలోచించరు. వరదరాజు అసలాలోచించటం లేదు. ఒక్క ఏడుకొండలే ఆ బాధంతా పట్టించుకుని నడుపుతున్నాడు. అతనికి విరక్తి కలిగినప్పుడల్లా, "ఏరా వరదరాజూ ఇట్టాఐతే ఎట్టరా? రేపటికి పాలకి డబ్బులు లేవు, ఈ ధర్మసత్రంగాళ్లు వొదలరయ్యే!" అంటాడు.

వరదరాజు పకపకనవ్వి, "ఆనిక్కి నేను డబ్బుతెస్తాలేరా! ఏడవకు అంటాడు.

ఒకనాడు మధ్యాహ్నం రెండుగంటలప్పుడు ఇజేరకంగాసంభాషిస్తున్నారాయిద్దరూ ఆకాశం గాఢంగా మబ్బులుపట్టి ఉరుముతున్నది. పది నిమిషాలకల్లా పెద్ద వర్షం కురిసే సూచనలు కన్పిస్తున్నాయి. చల్లనిగాలి విసురుగా వీస్తోంది. టీషాపులో జనం తక్కువగా వున్నారు. ఒకరిద్దరు టీ తాగి హస్కు కొడ్తున్నారు.

ఈ సమయాన సన్నని తుంపర ఆరంభమైంది. రోడ్డుమీద గొడుగుల్లేని కొందరు తడిస్తే కష్టం అనుకునేవాళ్లు టీషాపులోకి జొరబడ్డారు. వాన జోరయింది.

ఏడుకొండలు "ఒరే ఎందాకా తెస్తావురా డబ్బులు! ఇయ్యాల సాయంత్రం టీ పొట్లాం, పంచదార తేవాల్రా! ఏంటి! నవ్వుతా వేంటిరా దయ్యంలాగా!" అన్నాడు విసుగ్గా.

వరదరాజు నవ్వాడు. "నే వెళ్ళి బస్తా పంచదార, టీ పొట్లాలూ అన్నీ పంపిస్తాలేరా! దిగులు పడకురా! ఏంటిరా నువ్వు" అన్నాడు.

వానకి జంకి లోపలికి వొచ్చిన వాళ్ళలో ఇద్దరు వరదరాజుకి ఎడంవేపు కుర్చీల్లో కూర్చున్నారు అందులో ఒకడు బ్రహ్మానందం వెనకటి కంటె కొంచెం చిక్కిపోయివున్నాడు. కళ్ళల్లో కాంతి అలాగేవుంది. గడ్డం మాసింది. దుస్తులు నీరుకావి పట్టివున్నాయి. అదంతా ఎక్కడో గుమాస్తా పనిచేస్తున్న కళ అనిపిస్తోంది.

వరదరాజు రేడియో తిప్పుతూ కూర్చున్నాడు. అతని మనస్సులో ఒకవేపు తన గదికొచ్చే ఆ కుర్రాడూ, ఇంకోవేపు తన వొళ్లకూలిన డబ్బా మెదుల్తున్నాయి. ఆ పసివాడికి తనంటే ఏమిటో ఆ ప్రేమ!.. అందరూ భయంతో - జంకుతూ పక్కకి తప్పుకునే తనతో ఆపసివాడు ఏ అరమరికలూ లేకుండా స్వేచ్ఛగా ఆడుకుంటున్నాడు. చిత్రం

బ్రహ్మానందం, అతినుతోటివాడూ ఏదో కలప అడితీ సంగతి చర్చించుకున్నారు. వరదరాజు చెవిలో మధ్యమధ్య ఆ సంభాషణ పడుతున్నది. ఎందుకో ఆ సంభాషణపట్ల కొంత ఆసక్తి కలిగిందతనికి. రేడియో కట్టేసి చెవొగ్గి వినసాగాడు.

బ్రహ్మానందంతో వున్నాయన, "నువ్వెన్నన్నా చెప్పవోయ్, కలప వ్యాపారం భలే లాభం! తెలుసా?" అంటున్నాడు.

బ్రహ్మానందం, "కాదని నేను అనటం లేదు. ఉన్నది అమ్మేసిపోయి ఇంకో దాన్లో దిగేటప్పుడు కొంచెం జాగ్రత్తగా వుండాలి అని నా సలహా" అన్నాడు.

ఈ సందట్లో ఏడుకొండలు వాళ్ళిద్దరికీ టీ తెచ్చి పెట్టాడు.

రెండో ఆయన, "కలప వ్యాపారం అంతా నీకూ తెలుసుగాబట్టి చెబుతున్నాను. ఈ గుడ్డలమూటలు నెత్తినేసుకుని ఎండనక వాననక తిరిగి తిరిగి ప్రాణం బేజారైపోతూంది. ఇంకో రెణ్ణెల్లలోపున ఏదో స్థలంచూసి కలప అడితీ పెడ్తా" అని టీ త్రాగటానికుపక్రమించాడు.

బ్రహ్మానందం "కానివ్వండి. అది మంచి పసందైన బేరం. వేలల్లో వుంటుంది వ్యవహారం. వొచ్చినా అట్లావొస్తుంది. పోవటమూ అంతే. మెలకువగా వ్యవహరించాలి. అయినా మీకు నేను చెప్పేదేముంది! వ్యాపార దక్షత వేరే నేర్పాలా మీకు! షావుకార్లయ్యెను" అంటూ నవ్వాడు.

వాన విడవకుండా జోరున కురుస్తోంది. రోడ్డుమీద వాననీరు కాలువలు కట్టింది. టీకొట్టు బైటవాకిలికి అడ్డంగా జనం కూడారు, వానకి తప్పుకునిలోపల చీకటిగా వుంది. ఏడుకొండలు లైటువేశాడు. పగలూ రాత్రీ కానట్టు తమాషాగా వుంది లోపల వెలుగునీడల స్థితి.

ఈ విచిత్ర వాతావరణంలో వేడి టీ చప్పరిస్తూ తాగటం, రేడియోలో వస్తున్న ఏవో పాటలు వినడం, చాలా ఆనందం కలిగిస్తున్నది బ్రహ్మానందానికి

వరదరాజు ఈ సంభాషణ వింటున్నాడు ఆసక్తిగా. తనదగ్గర వున్న డబ్బు బైట పెట్టటానికి తనూ ఓ కలప ఆడితి పెడితే...!

వాన కొంచెం వెలిసింది. బ్రహ్మానందంపక్కన కూచున్నాయన, "వాన తగ్గిందోయ్, నేను వెళ్తాను" అన్నాడు.

బ్రహ్మానందం, "సరే, వెళ్ళండి. నేను మళ్ళీ వూళ్లో కెళ్లాలి." అన్నాడు. ఆయన వెళ్లిపోయాడు వరదరాజు ఇదే అదనులో, ఏడుకొండల్ని కేకేసి, "ఇదిగో వొరే, ఆయనకి మంచి టీ కలుపుకొచ్చి ఇయ్యరా" అని బ్రహ్మానందం వేపు చూపాడు.

బ్రహ్మానందం, "నేను అడగలేదండి! ఇంత క్రితమేగా తాగాను?" అన్నాడు.

"ఫర్వాలేదు లె తాగండి" అన్నాడు వరదరాజు.

"విడెవడు కొత్త సుత్తెగాడు" అని గొణుక్కుంటూ ఏడుకొండలు టీ కలపటానికి వెళ్లాడు.

వరదరాజు గల్లాదగ్గిరనుంచి లేచి, బ్రహ్మానందంపక్కనే కుర్చీలో కూర్చున్నాడు. "ఏమండీ! మీది ఏ వ్యాపారం!" అని ప్రారంభించాడు మెల్లెగా. ఇంకా సామాజిక లాక్యాలు తెలియనందువల్ల ఊరూ పేరూ అడగలేదు.

బ్రహ్మానందం కొంచెం ఆశ్చర్యపడుతూనే "నేనా! నేను కలప అడితీలో గుమాస్తాగా వుంటున్నానులెండి...నాతో ఏమైనా పని వుందా మీకు" అన్నాడు.

వాన జల్లు టీషాపు కిటికీలగుండా లోపలికి విసురుతోంది చల్లని గాలితోపాటు.

వరదరాజు "కాస్త పనివుండే అడిగాను" అంటూ ఏడుకొండలు తెచ్చిన టీ అందుకుని బ్రహ్మానందానికిస్తూ, "నాకు కాఫీ పట్రా" అని ఆజ్ఞ ఇచ్చాడు. "మీరిందాక ఏదో కలప అడితీ కొనటం, అమ్మటం అంటున్నారు, ఎక్కడ వుందా అడితి?" అని ప్రశ్నించాడు.

బ్రహ్మానందం టీకొట్టునంతా ఒకసారి కలయజూశాడు, ఇలాంటివ్యవహారాలు టీకొట్టువంటిబహిరంగస్థలాల్లో మాట్లాడ్డానికి సంకోచిస్తున్నట్టు. ఆ సంకోచం పైకి తెలియకండా, టీ చప్పరించసాగాడు.

వరదరాజుకీ ఈ సంశయం వున్నది. అందువల్ల బ్రహ్మానందం చూపులో సంకోచాన్ని పసిగట్టాడు. "ఇక్కడ మాట్లాడ్డం బాగుండకపోతే.. వేరే ఎక్కడికన్నా వెళ్దాం!" అన్నాడు చప్పున.

బ్రహ్మానందం, "అవునండి, ఇంకెక్కడన్నా అయితే బాగుంటుంది. ఇక్కడ నలుగుర్లో వ్యవహారాలు మాట్లాడ్డం బాగుండదు" అంటూ వరదరాజు వేపు చూశాడు. ఎదురుగా కూచున్న ఈ ఆరడుగుల చామనచాయ వ్యక్తి గంభీరంగా నిండుగా కన్పిస్తున్నాడు. వేలికి పెద్ద ఎర్రరాయి వుంగరం ధగధగలాడుతోంది. రిస్టుకి బంగారపు చెయిన్; మెళ్లో సన్నని బంగారుగొలుసూ. నీటయిన సిల్కు చొక్కా..... కాస్త వున్నవాడే.. బ్రహ్మానందం ఇంతవరకూ అంచనా వెయ్యగలిగాడు వరదరాజును. మిగతా వివరాలు కాసేపు మాట్లాడితే బయట పడతాయి..అని అతని వుద్దేశం.

కాఫీ తాగాక వరదరాజు లేచి, "వొరే ఏడుకొండలూ, ఇక

 

# అపస్వరాలు



గంట జాగ్రత్తగా చూసుకోరా, ఇప్పుడే వస్తా” అంటూ బ్రహ్మానందంతో బయల్దేరాడు.

వాన ఉధృతం తగ్గి నిలబడి ధారలుగా కురుస్తోంది. టీ కొట్టుకి పదిగజాల అవతల నిలబడివున్న జట్కా బండిని పిల్చాడు వరదరాజు. గుర్రం బాగా తడిసి వొణుకుతోంది. బండి తోలేవాడు అంతకంటే వొణుకుతున్నాడు.

బండిలోకి ఎక్కి కూర్చుని “బందర్ రోడ్డు మీద గదికాడికి పోనీరా” అన్నాడు వరదరాజు గుర్రబ్బండివాడితో. ఇద్దరూ స్నేహితులే బండి బయల్దేరింది.

బ్రహ్మానందం సంతోషిస్తున్నాడు కొంచెం ఇలాంటివాడు ఆ అడితికొంటె. అటు అమ్మినవాడూ వీడూకూడా కొంత కమిషన్ ఇస్తారు. ప్రస్తుతం తనున్న ఇరుకులో వందవొచ్చినా వొచ్చినట్టే...

వరగరాజు మౌనంగా కూర్చున్నాడు. గుర్రబ్బండిలో వ్యవహారాలు మాట్లాడితే ఇహ రేడియోలో చెప్పినట్టే..

వాన తుంపరలు గుర్రబ్బండిలోకి పడుతున్నాయి. వెలుగు మందంగా చిన్న కిటికీగుండా లోపలికి ప్రసరిస్తోంది. ఒకరికొకరు నూతనులైన ఇద్దరూగూడా మౌనంగా ఆలోచిస్తూ, మసికబారి, దీనంగా మొగమ్మ తెరగని గుర్రంబ్బండి లోపల చూస్తూ కూచున్నారు.

అరగంటకి ఆ బక్క చిక్కిన గుర్రం ఎట్లాగో లాక్కొచ్చి బందర్ రోడ్డులోని పచ్చమేడదగ్గర వొదిలిపెట్టింది ఇద్దర్నీ. వరదరాజు, అర్ధరూపాయి బిళ్ళ బండివాడికి పారేసి గదిలో కొచ్చాడు.

ఇద్దరూ చిరిచాపమీద కూర్చున్నారు.

వరదరాజు కిటికీగుండా వొంటరిగా గాలికి వూగుతున్న కొబ్బరి చెట్టువంక చూస్తూ, “ఏమండీ, ఆ అడితీ ఎవరిది, ఏమిటి కాస్త చెప్పండి” అన్నాడు.

బ్రహ్మానందం గదిలో సామాన్లవంక చూస్తూ, “కాలవ రోడ్డు మీద వుందండి పెద్ద అడితీ—మీరు భరాయించగలరో లేదో...” అన్నాడు.

వరదరాజు పకపకనవ్వాడు, చాలా సహజంగా. “ఎంతయినా ఫర్వాలేదు చెప్పండి” అన్నాడు, కొబ్బరిచెట్టుమీదినుంచి దృష్టి మరల్చి, సిగరెట్టు వెలిగిస్తూ

బ్రహ్మానందం, “అడితీలో, సరుకు చాలా తక్కువగావుంది. స్థలంకోసం ఐదారువేలు చెబుతున్నాడాయన. నేనా అడితీలోనే గుమస్తాగా వుంటున్నాను లెండి.. దాపరికం ఎందుకు! నిజంచెప్పితే పోతుంది” అన్నాడు.

వరదరాజు ఒక క్షణంగూడా ఆలోచించలేదు సిగరెట్టు దమ్ము లాగుతూ, ఒక సిగరెట్ బ్రహ్మానందానికిస్తూ, “సాయంత్రం బయానా ఇవ్వండి. ఐదయినా సరే, ఆరయినా సరే...బాధ లేదు...” అన్నాడు.

బ్రహ్మానందం, కొంచెం చకితుడైనాడు. ఇంతవరకు ఇతను ఆ అడితీ ఎట్లావుంటుందో గూడా చూడలేదు కనీసం తనెవరో తెలియదు బ్రహ్మానందం వరదరాజు ఇచ్చిన సిగరెట్టు తీసుకోకుండా, “అంత తొందరపడకండి. సాయంత్రం, మీరుకూడా నాతో వచ్చి అడితీని చూడండి.. తర్వాత మాట్లాడుకోవచ్చు” అన్నాడు.

వరదరాజు మళ్ళీ నవ్వాడు. “నేనేం చూడక్కర్లేదు. మీమీద నమ్మకమేనండి. మీరుచూస్తే చాలు.. సాయంత్రం వొచ్చి బయానా తీసుకోండి తిరిగి మీరే గుమాస్తాగా వుందురు గాని; నాకు ఆ బేరం కొత్తగదూ!” అన్నాడు

బ్రహ్మానందం కొంచెం ఆశ్చర్యంగా చూశాడు వరదరాజు వంక.

వరదరాజుకి ఈ ఆశ్చర్యం అర్థమైంది. “మీరేదో కొంచెం ఆశ్చర్యపడ్డట్టున్నారు. నేను మనిషిని నమ్ముతాను. అంతే ఇందులో ఇంకేమీ లేదు. మీరు ఇప్పుడు వెళ్ళి సాయంత్రం రండి. మీ జీతం అడ్వాన్సుగూడా తీసుకువెళ్ళండి” అంటూ లేచాడు.

బ్రహ్మానందం అంతే ఆశ్చర్యంతోటి లేచాడు. వరదరాజు సరాసరి బయటికి వొచ్చాడు. గది తలుపు వేసి రోడ్డుమీద కనపడ్డ రిక్షా ఎక్కుతూ, జేబులోనుంచి ఓ ఐదు కాయితం బ్రహ్మానందానికిస్తూ “బండి చేసుకుని వెళ్ళండి. సాయంత్రం టీ కొట్టుదగ్గరకి రండి” అంటూ వెళ్లిపోయినాడు.

బ్రహ్మానందం పచ్చమేడ మారుకంద నుల్చుని చేతిలో ఐదు కాయితాన్ని అటూఇటూ తిప్పిచూస్తూ, ఆశ్చర్యంలో మునిగి నుంచున్నాడు. వ్యాపారలోకాలు ఎరిగున్నవాళ్ళకి వరదరాజు వంటివ్యక్తుల నిర్లక్ష్యవైఖరి చప్పున అర్థంగాదు అతనికి ఈ సంభాషణవల్ల ఇందాక అనుకున్నట్టు వరదరాజు వ్యక్తిత్వాన్ని అర్థం చేసుకోటం అంత తేలిక అనిపించలేదు. [ఇంకా ఉంది]

# యేటి వెల్లువ

## యస్. రామచంద్రం

అదీ యిది సర్దుకొని ప్రయాణమయ్యేటప్పటికి ప్రొద్దుకుంకవచ్చింది రాహుకాలానికి ముందు నాలుగుగంటలకల్లా బయలు దేరవలసినవారు, పట్టు విడుపు అనే సరికల్లా ఆరుగంటలు కావచ్చింది అందులోను పెండితర్వాత జరగవలసిన మూడు పెళ్లిసాంగ్యమాయె (తంతు) తను పెలిగించేది గుమాస్తా గిరియైనా అప్పోసప్పో చేసి తనకు తగినంతవరకు నలుగురిలో నేతెత్తి చూపించుకోకుండా జరుగవలసిన మర్యాదలకు రివాజులకూ భంగం రానీయక, పట్టుమని యీ పెండ్లిచేసేసరికి సిద్ధయ్యగారి రామచంద్రయ్యకు తాతలు దిగొచ్చేరు దైవలిఖితం వేరొకవిధంగా వుంది గాబట్టి సరిపోయిందిగాని, అంతో యింతో చదువుకొన్న తన చెల్లెలు శకుంతల యీ కాలం వాళ్లలాగ - నాకు నాలుగురాళ్లు సంపాదించి నాలుగువూళ్లుతిరిగే - ఉద్యోగస్తుడే వరుడని పట్టుబట్టేటుంటే ఇక యీ గ్రంథం నడిచిచే వుండదు అట్లని వరుడు అవిటివాడని - అంత అనాగరికుడనీ గాదు ఈడుకు తగినజోడుగాదనిమాత్రం చెప్పొచ్చు ఆ పెండ్లి అలాంటి వ్యక్తితో జరగడమనేది - అంతో యింతో సంస్కృతీపరుడనీ అనిపించుకొన్న ప్రతివాడినీ ఆశ్చర్యానికి గురిచేసింది ఇందులో యేదో వెనక అనూహ్యమైనకీలకం వుందని - విమర్శలకు గురిఅయినా రామచంద్రయ్య మౌనము - ఉదాసీనతతో - నిర్లిప్తంగా ఆ వరుడి హస్తాల్లోని తాళి బంధానికి మెడ వంచింది ఆమె సంఘర్షణలు యెంత తీవ్రంగావున్నా - పెండ్లిమాత్రం నిరాటంకంగా జరిగిపోయింది

జరగవలసిన లాంఛనాలు జరిగిపోయినై పడుపవలసినసాంగ్యాలు – యేలోటు లేదు ఉన్నా - వరుడు వీరినుంచి అది తక్కువ యిది తక్కువ అని ఆశించి మామగార్ని హింసించి ఉన్నవి లేనివి అడిగి పెట్టించుకొనే యీకాలపు అల్లుళ్లంత స్థితి తక్కువవాడు కాదు ఆదాయం నాలుగు అంకెలమీదవచ్చే పొలాలున్నాయి వందలమీద వడ్డీవచ్చే రొక్కమూ వుంది - మాటకారిగానూ - పలుకుబడిగలవాడుగాను - వూరికంతా పెద్దఆసామిగాను, చలామణీ అయ్యేవాడు, రావూరి అప్పయ్యనాయుడు అంటే ఆవూర్లో తెలియనివాడే లేడు ఆ స్త్రీకితగ్గ చదువు లేదనిమాత్రం చెప్పొచ్చు చదివి యేవూళ్లేలాలి? అని వాళ్లతలిదండ్రులు తమవూరిబడిలో ఐదోతరగతి చదువుతోనే నిలిపివేశారు - పొలము బుట్రా చూచుకొంటున్నారు తండ్రి చనిపోయేనాటికి అప్పయ్యకు వాళ్ల లెక్కప్రకారము పెండ్లియీడు - అంటే 22 యేండ్లు - అప్పటినుంచి - సరైనసంబంధం చూచి ఒక యింటివాడు గావలసిందని యింటాబయటా - ఇరువైనాలుగు గంటలూ చెవి నిల్లు కట్టుకొని తల్లి శతపోరుచేయగా - ఈయనగారు పదివూళ్లు క్యాంపుచేసి - యెరిగివున్న వాళ్ళను వాకబుచేసి - యేడుజోళ్ళు అరిగేటట్లు తిరిగి యీ సంబంధం స్థిరపరచుకొన్నాడు ఐదునుంచి పదివరకు తక్కువగాకుండా కట్నాలుయిచ్చి, జరుగవలసిన లాంఛనాలు బ్రహ్మాండముగా జరిపి కాళ్లు కడిగి కన్యాదానం చేసే దాతలుండగా యీ కూటికి తక్కువ సంబంధానికి కక్కుర్తి పడవలసిన వ్రాతయేమని తల్లి యెదిరించినా మొదట్నుంచి తన పంతమే నెగ్గించుకొంటున్న అప్పయ్యకు తన ప్రయత్నంలో గెలుపొందడం యేమంత కష్టం గాకపోయింది - కట్నం కానుకలు లేకపోయినా వుండవలసిన గుణాలు - ముచ్చటైన రూపము చూచి అందినంతవరకు అదే చాలు లెమ్మని - అప్పయ్య అమ్మ తృప్తిపడింది అలంకారముతో బాటు అమూల్యమణులను అర్పించే ఆసాములు అందరుండగా, యెవ్వరూ అనుకోని యీ కొత్తసంబంధాన్ని చూచుకోవడంలో కీలకం వధువైన శకుంతలయొక్క అద్వితీయ గుణవికాసము - ఆ లేఖ్యతనూ విలాసము - అని చెప్పొచ్చు ఇందుకు నిదర్శనంగా అప్పయ్య తన అమ్మతోబాటు ఆప్తమిత్రులతో గూడ తాను యిన్నిళ్లు పెండ్లిచేసుకోకుండా ఆగింది, అంతటి గుణవంతురాలు, అంతటి అందగత్తెను భార్యగా పొందే అదృష్టంకోసమేనని - పలుమార్లు చెప్పుకొన్నాడు వాళ్ళచేత చెప్పించుకొని తృప్తిపడాడు

అయితే యిందులో అందని రహస్యమిల్లా అప్పయ్య అడిగినపుడే - యీడుజోడు లేని అతడికి ముందువెనక లాలోచించకుండా వుటుక్కున మాటచెప్పిన రామచంద్రయ్య ప్రవర్తనా దేనికైనా సిద్ధపడే యోగినిలాగ మౌనంగా భవిష్యత్తు యెరిగున్నదానివలె - సమాధానం లేకుండా పెండ్లికి అంగీకరించిన చెల్లెలి ప్రవర్తన యున్నూ - పెండ్లి జరిగిపోయింది మూడు యేండ్లక్రితంనుంచి తెగితెగి ప్రవహిస్తున్న ఆమె కన్నీళ్ళకు - కట్ట - పెండ్లినాడూ లేదు - యీనాడూ లేదు

పెండ్లిసామానులు వేసుకొన్న బండి కదిలింది రాహుకాలమన్నారు తెలిసిన పెద్దలు అవన్నీ దాన్ని చూచి బెదరేవాళ్లకే పొమ్మన్నాడు అప్పయ్య తలబిరుసుతనమనుకొన్నారు వాళ్లు పిల్లకింకేమీ పనిలేదనుకొన్నాడు యితడు

పదిసె బొవురుమంది చూడవచ్చిన చుట్టుప్రక్కలవారు కన్నీళ్లు ఒత్తుకొన్నారు కదిపివేస్తున్న హృదయకంపాన్ని అదిమిపట్టడానికేమో వధువు తన రెండుచేతులతో ముఖాన్ని గట్టిగా మూసుకొన్నది - రెండు మూడు యేండ్లుగా చెల్లెలి ముఖాన్ని చూడడానికి, పల్లెత్తి మాట్లాడడానికి జంకుతూ వున్న రామచంద్రయ్య బావమర్దిదగ్గర సెలవు తీసుకొని - గిరుక్కున తిరిగి అగ్నిచేత దహించబడేవాడిలాగ రివ్వున యింటికి జేరుకున్నాడు - ఘోరము ఆక్రందన - ఆ యింటిలో ప్రతిధ్వనించింది.

బండి చరచరమని యిసుకలో పోతూవుంది ఎడ్లమెడలో మువ్వలు గణగణమని ధ్వనిచేస్తున్నాయి వధువు వూరైన సంగమేశ్వరంనుండి వరుడి వూరు రామాయప్పపురానికి సుమారు పదునైదుమైళ్లు - కనుమప్రయాణం మాత్రమే పదిమైళ్లు అడివి దాటినతర్వాత మూడుమైళ్లు ప్రయాణం చేస్తేగాని వూరురాదు

రాతి విగ్రహంలాగ కూర్చొన్న వధువు - అంతవరకు కన్నీటితో తడిసిన ముఖానికి అంటుకొని ఉన్న చేతులు తీసింది "ఆమె బాధేమిటి? చిన్నప్పటనుంచి నాన్న లేని లోటు తీర్చిన తన అన్న పెద్దయినాక బాధపెట్టాడే కాని తాను యింటినుంచి వెళ్ళిపోయేనాడుగూడ, వదలి పెట్టలేకపోయిందే!



# యేటి వెల్లువ



ఆడదిగా తన జీవిత మిందుకే సృష్టింపబడింది కాబోలు - తను చదివితేగాని పెండ్లిచేసుకోని అన్న, పెండ్లితర్వాత అంత విచిత్రంగా మారిపోయా డెందుచేత? యే పరిస్థితులకుగాని మార్పు చెందని హృదయం అతనిది తనమీద జుగుప్స కల్గించే వాతావరణం - యెక్కడినుంచి వచ్చి యేర్పడింది? తనకు చదువు చాలదన్నాడు ఇంగీషు నేర్పాలన్నాడు - అతడే ప్రైవేట్ స్టడీస్ కుగాను కావలసిన పుస్తకాలు తెప్పించాడు ప్రైవేటు తనే చెప్పేవాడే - తన చెల్లెల్ని జీవితంలో వెలుగు చూచేవరకు తను పెండ్లిమాట వద్దని భీష్మించుకొన్న - అతడేనా - పెండ్లి ఐనతర్వాత యింత అనూహ్యంగా మారిపోయింది! అంతే! అప్పటినుండి ప్రవేటు సరిగా చెప్పేవాడు కాదు మౌనంగా వుండిపోయేవాడు అంతకుముందే అవకతవగ్గా వున్న ఆర్థిక పరిస్థిలు ఆ పెండ్లి తర్వాత అతన్ని క్రుంగదీసి వుండవొచ్చు [illegible]కొన్నది కాని తనవల్ల యీషణ్మాత్రం తప్పుకలిగినా కొంప మునిగినటు ఛర్రున లేచేవాడు తనకు చదువు చెప్పేటప్పుడు యే కొద్దిపాటి తప్పుకల్గినా బ్రహ్మాండంగా కేకలు పెట్టేవాడు కుటుంబంలో యే యిబ్బంది కల్గినా - సెపం బెట్టి - నోటికొచ్చినట్లు తన అక్కసు వెళ్లబుచ్చేవాడు యేనాడు లేనిది కొన్నివేళ్లలో తనమీద చెయి చేసుకొన్నాడు చిలికి చిలికి గాలివాన ఐంది - కుటుంబంలో ప్రచ్ఛన్నయుద్ధం ప్రారంభమైంది అంతే తను అతనితో మాట్లాడ్డం అతనికి యెదురుగా పోవడం చాలించుకొంది తన్ను సాధించడానికి ఈ పెళ్లి ఆసరాగా తీసుకొన్నాడు ఆడదైవుండీ, ఒకరి మోచేతిక్రింద నీళు తాగుతూవుండి, మగవాడిమీద 'చరత్తు' వేసిందని వేపుకతినడం ప్రారంభించేడు హృదయాన్ని తూట్లు పొడిచే సంఘటనలకూ - పరిస్థితులకుగూడ చలింపని తన ప్రవృత్తే అతని కలా అనిపించిందేమో తన్ను లెక్కింపనిదానిగతి చూడమన్నాడు ఆ ప్రతిజ్ఞకు ప్రతిరూపమే యిది తల్లి లబోదిబోమని - నెత్తీ నోరు మొత్తుకొన్నది కలిగినవాడుగాకపోయినా యీ దుజోడైనా చూడమన్నది ఆమె యేడ్పులు యేడ్పులుగనే మిగిలిపోయాయి - తన ప్రవర్తనను ఒక పట్టింపుగా అర్థం జేసుకొన్న అన్న యీవిధంగా తన్ను సాధించా డనుకొన్నది ఇంక తన బ్రతుకును కర్మకు వదలి వేసింది దేవుడున్నా డనకొన్నది

కానీ యిది అబద్ధం - తనఊహకు స్థానం లేదు తన అన్న తనకు తెలిసినంతవరకు కన్నబిడ్డలాగ తన్ను సాకి సంరక్షించేడు కన్నుల్లోబెట్టుకొని కాపాడేడు ఒక ఆడదానిమీద పంతాలుపూని అనాథజీవితాన్ని అంతదారుణంగా యెడారిలో పాతి పెట్టేంత నీచుడని యెలా అనుకోగలదు? నాన్న చనిపోయిననాడుకూడ కన్నీటిబొట్టు విడువని అతడు తన్ను పొగనంపే యీనాడు తనముఖం చూడలేక - యేకాంతంగా తన హృదయం విప్పి విలపించవలసిన అవస్థ అతనికేంపట్టింది దీనికంతకూ మూలకారణం- అతన్ని క్రుంగదీసిన కుటుంబపరిస్థితులు - అతనొక్కక పిచ్చివాణ్ణిచేసిన ఆర్థిక చిక్కులూ- ఇప్పటికిగానీ తన జీవితసమస్య అర్థంగాకపోయిందేమా అనుకొన్న ఆమె దీర్ఘంగా నిట్టూర్చింది ఆ నిట్టూర్పు మూడేండ్లుగా గూడుకట్టుకొన్న ఆమె హృదయభారాన్ని సడలించింది

"తనఅన్నవల్ల తప్పులేదు - పుట్టి ఎవ్వర్నీ సుఖింపచేయలేక బ్రతికి యింకా బాధపెట్టూవున్న తనదే తప్పు అదృష్టహీనమైన గ్రాత నుగుట వేసుకొని ఆడదిగా పుటడంకంటే అడవిలో చెట్టైపుట్టినా బాగుండేది "

"అగ్గిపుల్ల చర్రుమన్నది ఇంతవరకు బండివానితో లోకాభిరామాయణం, తన చిన్ననాటి ముచ్చట్లూ చెప్పుకొంటూన్న అప్పయ్య బీడి ముట్టించాడు పెండ్లి ఐనది మొదలు ఇంతవరకు భర్తను చూడని వధువుకు యీ వేళ యెందుకో అతణ్ణి పరీక్షగా చూడాలని బుద్ధిపుట్టింది వెడల్పైన అతని ముఖం ఆ వెల్తురులో స్పష్టంగా కన్పడ్డది - కోరమీసాలు, జులపాలు తిరిగిన గిరజా - మబ్బులోగూడ మెరిసే చెవి అంటు జోళ్ళు, వీధినాటకంలో దుర్యోధన మహారాజును గుర్తుకుదెస్తున్నయ్ గర్వంతో నిండుకొన్న కళ్లు - నిర్లక్ష్యం తొణికిసలాడే అతనిమాటలు - అతని ఐశ్వర్యానికి ఆనవాళ్లు ఆతని నడవడిక - నడక తనను గుణంగా వుంటాయి గంటగంటకు బీడిముట్టించడంలో మాత్రం యేమఱుపాటు యెరుగని జీవి, అతడు - పెండ్లిజరిగి మూడు నెలలైనా, తన స్థితిగతులకు తగ్గట్టు ఆమెకు అతనివద్ద స్థానం లభించింది - కర్కశంగా పలుకరించడం - చులకనగా చూడడం నేర్చుకొన్నాడు తనొక పశువై ఆమెను ఆటబొమ్మగా ఉపయోగించుకొన్నాడు భార్య ఐతేమాత్రం ఆడదిగదా? ఆ గరువు లేనిది ఆడదంటే వీధిలోని కుక్కకుగూడ పలీసే మరి! జీవితాన్ని నిర్లక్ష్యంచేసి- ఆశల్ని చంపుకొన్న ఆమెకు యీ తడి లాలన పాలనల్లోని వ్యత్యాసాలు వెదికే అవసరమే లేకపోయింది

మబ్బులు క్రమ్మి గాఢాంధకారం అవరించింది దట్టమైన కీకారణ్యం మధ్యలో బండి నడుస్తున్నది కనుమ మొగదలతోడు అందుకొన్న బండ్లు ధణధణమని ముందు పోతూవున్నయ్ ప్రయాణీకులూ - బండ్లకు తోడుగా వచ్చేవారు పొడుగాటి దుడ్డుకర్రలు చేతబట్టుకొని బండ్లవెంబడి నడుస్తూనే వున్నారు అడవి అంతా నిశ్శబ్దం ఆవరించివుంది దూరదూరంగా చెట్లు హోరుమనే గాలిలో భయంకరంగా అటూ యిటూ వూగుతూ వున్నయ్ - యెద్దులు ఆయాసంతో బుసకొట్టుకొంటూ బండ్లను మలుపులు తిప్పుకుంటూ యీడ్చుకపోతున్నయ్ - తోడి ప్రయాణీకులు ఒకరినొకరు హెచ్చరించుకొంటూ, పొగచుట్టలు వెలిగించుకొంటూ కావలసినవి, అక్కరలేనివి ముచ్చటించుకొంటూ, నడక సాగిస్తున్నారు కొందరు కూనిరాగాలు తీస్తున్నారు - దగ్గరలోని కొండ చెరియలోనుంచి వచ్చేగాలి రెపరెపమంటూ బండిని రాసుకొని పోతున్నది మిణుకు మిణుకుమంటున్న చుక్కల్ని మబ్బులు మ్రింగుకొంటూ పోతున్నయ్ ఉక్క వేయడం మొదలెట్టింది

"రంగయ్యా! దూరాన మెరిసినట్లుంది" వరుడు అప్పయ్య బండితోలేవానితో అన్నాడు

"వర్షం వచ్చేలాగుంది - తప్పక తేపతగిలి తీరుతుంది ఐనా బండి కొత్తగేకదూ - చుక్క లోగా దిగదు" రంగయ్య అందుకున్నాడు

"నువ్వు తడిసిపోతావేమో - మరి - గొడుగుందిగా అలా పట్టుక కూచో యెందుకైనా మంచిది"

"నాకేమొచ్చెగాని అమ్మాయిగార్ని కాస్త ముంగుకు జరిగి కూచోమనండి" అని యెడ్లను అదలించాడు రంగయ్య

వానవచ్చే సూచనలు కనపడ్డంతో తోడి ప్రయాణీకుల సందడి యెక్కువైంది యెవరికి వారు జాగ్రత్తపడుతున్నారు తీసుకోవలసిన జాగ్రత్తల్నిగూర్చి ఒకరొకరు హెచ్చరించుకొంటూ - పరస్పర సహాయాన్ని ఆశ్రయించుకొంటూ గోలచేస్తున్నారు బండి గూడుపైన చిటపటమని శబ్దమైంది రివ్వుమని గాలి బండిని దూసుకపోతూవున్నది కన్ను పొడుచుకొన్నా కానరాని కటికచీకటిలో, తచ్చాడుతూ, దారితెలియక మందగిస్తున్న యెడ్లను గట్టిగా అదలించి తోలుతున్నారు వాన ప్రారంభమైంది - చిటపటమని చినుకులు మొదలెట్టేయ్ - త్రోవ ప్రయాణానికి తెచ్చుకొన్న లాంతర్లు గుడ్డివైనాయి గిజగిజలాడిస్తూ చలి ప్రారంభించింది

కనుమ ప్రయాణం దుర్భరమైంది తడిసి తల్లడిల్లి చెల్లాచెదరై పరిగత్తిపోతూవున్న పక్షుల కిలకిలారవం హోరుమనే వానలో

మరుగైపోతూవుంది. బీడి వెలిగిస్తున్న అప్పయ్య అగ్గి ఆర్పి కూనిరాగం మొదలెట్టేడు - బండి నెమ్మదిగా అటు యిటు వూగుతూవుంది. ఇనుప గొలుసుల్లాంటి చేతులు వధువు శరీరాన్ని గట్టిగాబట్టి దగ్గరకు లాక్కొన్నయ్ - గచ్చపొదలాంటి విగ్రహానికి ఆమె అంకితమైపోయింది. ఉక్కుపంజరంలో చిక్కుకొన్న ఆమె సుకుమార శరీరం గడగడలాడింది.

తనెందుకోసమై పుట్టింది - జీవితంలో తను అనుభవించిన దేమిటి - విధి తన వ్రాతను, ఒక్కనాడైనా సుఖాన్ని నోచుకోమని ఆదమరిచి ఐనా వ్రాసియుండలేదు. అందరితోపాటు దేవుడికీ తనమీద పగ యెందుకో? అతడికి తను చేసిన అపకారమేమిటి? తండ్రిలేని కూతుర్నిగా పుట్టించాడు - అనాథకు సుకుమార శరీరాన్ని ప్రసాదించాడు. అన్నిటికీమించి అన్నగారి ఆదరాభిమానాల్ని పోగొట్టించేడు. తనమనోరథానికి విరుద్ధంగా యిలాంటి భర్తని చేకూర్చేడు. గోరుచుట్టుపై రోకటిపోటు లాగ - ఇలాంటిపరిస్థితులు కల్పించి - విచారించే ఆత్మనిచ్చి దుఃఖింపచేయడంలో దేవుడి యీ సృష్టివైచిత్రిలో గల రహస్యమేమిటి? తన అన్నమాత్రం తమార్హుడా? రక్తాన్ని పంచుకొని పుట్టిన చెల్లెలిని జిజ్ఞాస ఐనా లేక పరిస్థితులకు ఓడి - నిగ్రహంవీడి - గుండెల్నితన్నే సమస్యలకు లోబడి - తమ అశక్తతను కప్పిపుచ్చుకోవడానికి ఆడదాని ఘంతాలనే నెపాల్ని ఆసరాగా దీసుకొని - ఒక అమాయికజీవితాన్ని విధితోపాటు నలిపివేసిన కర్కశుడు రాక్షసుడుగాక మరేమౌతాడు? విధిలేనిపరిస్థితులలో విలపించడం రాక్షసులకు చేతనవును - కనుక తానూ హృదయావేదనకు లొంగి నేడు విలపించేడు. వంకరలేనిగీత తనది. అడుగడుగునా దినందినయాత్రలో దారుణంగా హింసింపబడే తన జీవితము యిలాగే కొనసాగుతుందా లేక"

బండి ధణేల్‌మన్నది. ఉలిక్కిపడ్డది - "పడిపోతుందనుకొన్నావా" కంచులాగ గొంతు సవరించాడు అప్పయ్య. "రాయెక్కిందిలే - భయపడకు" ఇనుపహస్తాల్లో చిక్కిన ఆమె గిజగిజ కొట్టుకొంటూవున్నా - విడువక - వికటంగా నవ్వడం మొదలెట్టేడు.

"నుమదాటేసరికి సుమారు పదిగంటలైయుండొచ్చు - వానజోరు యింకా తగ్గలేదు - బడితె దెబ్బలుతిన్న యెద్దులు దగ్గరలో వూరుచూచి గట్టిగా నిట్టూర్పు విడిచేయ్. తడిసి ముద్దైనా ప్రయాణికులు దొరికినపంచల్లాచేరి గబ్బిలాలై పోయారు. ఆ వూరిని కనుమక్రింద పల్లె అంటారు - సామాన్యంగా కనమ ప్రయాణంచేసే ప్రతివాడు యిక్కడచేరి - యేగంటసేపోఆగి - బడలిక తీర్చుకొని - లభ్యమయ్యే తిను బండారాలు తిని - అక్కడనుంచి తలకొకదారి చీలిపోతుంటారు. ఊరేమంత పెద్దదిగాదు - ప్రయాణీకులకని యేర్పడిన చిన్న అంగళ్లు యే రెండుమూడో వుంటయ్. అందులో అమ్మేదైనా అంతంతే! ఊరిముందర పెద్ద రావిచెట్టు - దానిక్రింద రచ్చవుంది. రాత్రి ప్రయాణంచేసిన ప్రయాణీకులు తమబండ్లను యీ చెట్టుక్రిందవదలి - ఆ రచ్చపైన కాసేపు విశ్రమించి వేకువజామున వారివారి వూర్లకు పోతూవుంటారు. రావిచెట్టు క్రిందున్న

# వనితాలోకం

## బహుభార్యాత్వ నిషేధం ★

పాకిస్తాన్ ప్రధాని మహమ్మదలీ స్విట్జర్లాండు జర్మనీలా గారి సుధ్యలో తనకు అయిదు సంవత్సరాలనుండీ కార్యదర్శినిగా ఉంటున్న మిస్ అలియా సాదీని వివాహము చేసుకొన్నాడు; ఆమెతో కూడా తన ప్రయాణాన్ని సాగించాడు. తిరిగివచ్చిన తరువాత ఆ దంపతుల గౌరవార్థం, పాకిస్తాన్ గవర్నరు జనరలు శ్రీ గులామ్ మహమ్మద్ ఒక విందు చేశారు.

ప్రధానికి ప్రథమ వివాహము 14 సంవత్సరాల క్రిందట జరిగినది. ఇద్దరు బిడ్డలు ఉన్నారు, భార్య జీవించే ఉన్నది. ముస్లిమ్ లా ప్రకారము నలుగురు స్త్రీలను వివాహమాడే అధికారముగల ప్రధాని అతి రహస్యముగా ద్వితీయ వివాహము చేసుకోవటము ఆశ్చర్యకరమైన విషయమే.

ఈవివాహోదంతము ప్రకటింపబడగానే ఈజిప్టు మహిళా సంఘాధ్యక్షురాలయిన మదామ్ దోరియా షఫీక్ పాకిస్తాన్ మహిళాసంఘాధ్యక్షురాలికి "ఈ వివాహము స్త్రీజాతికి అవమానకరమైన" దని తంతి యిచ్చినది. దీనిపై పాకిస్తాన్ మహిళా సంఘాలు తీవ్రతరంగా ఆందోళన సలిపాయి.

మతప్రకారము నిషేధము లేకపోయినా, నేటి సాంఘిక పరిస్థితులలో బహుభార్యాత్వము కూడదని మహమ్మదీయ వనితలు గ్రహించారు. వారికి మతము ఈ విషయములో అనుకూలముగా లేదు గనుక తీవ్రముగా కృషి సలిపితే గాని కార్యసిద్ధి కాదు.

ఒక భార్యకు విడాకు లిచ్చి మరొక స్త్రీని వివాహము చేసుకొనే ఆచారము బహుభార్యాత్వ మనిపించుకోదు. ఇటువంటి విడాకుల పద్ధతి పాశ్చాత్య దేశాలలో ఉన్నది. మహమ్మదీయులలో కూడా తల్లాఖ్ ఇచ్చే ఆచారము ఉన్నది. భారతదేశములో ప్రత్యేక వివాహాల చట్టము (*Special Marrages Act*) ప్రకారము వివాహము జరుపుకొనినవారికి కొన్ని సందర్భాలలో విడాకులు అందుబాటులోనే ఉన్నాయి. కాని జీవించి ఉన్న భార్యకు విడాకులు ఇవ్వకుండా రెండవ వివాహము చేసుకోవటానికి ఈ ప్రత్యేక వివాహ చట్టము అనుమతించదు. మద్రాసు ఆంధ్ర రాష్ట్రాలలో బహుభార్యాత్వాన్ని నిషేధించే శాసనం అమలులో ఉంది. సాధారణ హిందూ సమాజమూ, మహమ్మదీయ సమాజమూ వాని వాని ధర్మశాస్త్రాలను అనుసరించి బహుభార్యాత్వాన్ని నిషేధించటము లేదు; అంతగా హర్షించటమూ లేదు.

ప్రత్యేక వివాహాల చట్టముక్రిందకూడా వరునికి పెండ్లినాటికి 18 సంవత్సరాలు, వధువుకు 14 సంవత్సరాలు కనీసము పూర్తి అయిఉండాలి. వధూవరులిద్దరు ఉన్మాదము గాని చపలత్వము గాని లేక, మంచిపరిస్థితులలో ఉండాలి. వధూవరులు నిషిద్ధబాంధవులు కాకూడదు. ప్రత్యేకవివాహాల చట్టము ననుసరించి జరిగేవివాహానికి 'సివిల్ మ్యారేజి' అని పేరు. ఈ పద్ధతిలో వివాహము చేసుకొనదలచిన స్త్రీ పురుషులు రిజిస్ట్రారుకు వ్రాతమూలమున నోటీసు ఇవ్వవలసి ఉంటుంది. వధూవరులలో ఒక్కరైనా వివాహము జరుపుకొనదలచినజిల్లాలో, వివాహానికి పూర్వము, కనీసము 30 రోజులయినా నివాసము చెయవలసి ఉంటుంది. నోటీసు అందిన 30 దినములతరువాతనే రిజిస్ట్రారు వివాహము జరుపుతారు. ఇట్టి వివాహము చట్టసమ్మతము కాదని ఆక్షేపణ చేయదలచిన వారు, రిజిస్ట్రారుకు పెండ్లినోటీసు అందిన 30 దినములలోపల తెలుపవలసిఉంటుంది. వివాహవిషయమున తెచ్చిన ఆక్షేపణను రిజిస్ట్రారు రికార్డుచేసి, ఆక్షేపణచేసిన వ్యక్తికి వినిపించి, అతని సంతకము తీసుకోవలసి ఉంటుంది. ఏ పెండ్లికయినా ఆక్షేపణలు వచ్చినయెడల, అవి వచ్చిననాటినుండి 30 దినములలోపల వివాహము జరుపకూడదు. న్యాయస్థానాలు మూయబడి ఉన్నయెడల, తెరచిననాటినుండి 30 దినములు గడచిన

తరువాతనే వివాహము జరిగించవలసి ఉంటుంది. ఆక్షేపణ చేసినవ్యక్తి జిల్లా కోర్టులో దావావేసి, ఆ సంబంధమైన నోటీసు 30 రోజులలోపల రిజిస్ట్రారువద్ద దాఖలు చేయవలసి ఉంటుంది. రిజిస్ట్రారు ఆ వివాహమును సివిల్ కోర్టుతీర్పు చెప్పే వరకు రిజిస్టరు చేయుటానికి వీలు లేదు. కాగా ఆతీర్పుపైన అప్పీలుచేసుకొనేకాలము పూర్తి అయేవరకు గాని, అప్పీలు తీర్పు చెప్పేవంత వరకు గాని ఎటువంటి ఆక్షేపణలు లేనట్లయితే వివాహాన్ని రిజిస్టరు చేయవచ్చును. పెండ్లికి అనుకూలముగా సివిల్ కోర్టు తీర్పు చెప్పి నప్పుడు పెండ్లి చేసుకోవటానికి అవకాశము లభిస్తుంది. ఈ వివాహాన్ని చెడగొట్ట వలెనను కుత్సితపు బుద్ధితో అనవసరముగా అక్రమముగా కోర్టులకు బయలుదేరే వ్యక్తులు పెండ్లికి అభ్యంతరము చెప్పుతూ దావా తెచ్చినట్లయితే - అది నిరాధారమని కోర్టువారు తెలిసికొన్న తరువాత వారికి వెయ్యిరూపాయల జరిమానా విధించి దానిలో కొంత భాగమునుగాని అంతమొత్తమునుగాని వధూవరులకు కోర్టు వారు ఇప్పించవచ్చును.

వివాహము రిజిస్ట్రారుఆఫీసులో గాని లేక వధూవరులు కోరిన మరొక ప్రదేశములోగాని రిజిస్టరు చేసుకొనవచ్చును. పెండ్లినోటీసు పంపిన మూడునెలలలోపుగా వివాహము జరుగనియెడల ఆ నోటీసు రద్దు అయినట్లే. వివాహము చేసుకొనదలచుకొంటే వధూవరులు తిరిగి క్రొత్తనోటీసు పంపవలసి ఉంటుంది. ఈ చట్టముక్రింద, సామాన్యముగా జరిగిన ధార్మిక వివాహాలను కూడా రిజిస్టరు చేసుకొనవచ్చును.

ధార్మికవివాహాన్ని ఈ చట్టము క్రింద రిజిస్టరు చేయించుకొనదలచుకొన్న పక్షములో రిజిస్ట్రారు ముఖ్యముగా ఈ క్రింది విషయాలను గమనించవలసిఉంటుంది. వధూవరులు సమాజములో భార్యాభర్తల వలె మెలగుతున్నారా? వారి వివాహము ఎప్పుడు జరిగినది? సరిగా వారు చెప్పిన తేదీకే జరిగిందా? ఈ వధూవరులకు రిజిస్ట్రేషను నాటికి జీవించియున్న మరియొక భార్యగాని భర్తగాని ఉన్నారా? ఉన్నపక్షములో రిజిస్ట్రేషను జరగటానికి వీలుకాదు. వారిద్దరి మానసికపరిస్థితి సరిగా ఉన్నదా? లేనియెడల ఆక్షేపణ రాగలదు. వధూవరుల వయస్సు 21, 18 సంవత్సరాలపైన ఉండటము అవసరము. లేనిపక్షమున రిజిస్ట్రేషనుకు వీలుకాదు. వధూవరులు 21 సంవత్సరాలలోపు వయస్సుగలవారయినట్లయితే పోషకుల సమ్మతిని పొందినారా? పొందకపోయినయెడల [illegible] లేదు.

రిజిస్టరు అయిన ప్రతి వివాహమును

## తిరుమలనాయకుని మహల్‌లో కుడ్యశిల్పం



## బహుభార్యాత్వనిషేధం

గురించి రిజిస్ట్రేషను ఉద్యోగి రాష్ట్ర రిజిస్ట్రారుకు పూర్తి వివరాలను తెలుపవలసి ఉంటుంది.

ప్రత్యేక వివాహచట్టము క్రింద వివిధ మతాలకు చెందినవారి మధ్య వివాహాలు జరగటానికి వీలు కలుగుతుంది. హిందూ ధర్మశాస్త్రములోను కురాన్ మతములోను ఇది సాధ్యము కాదు. ఇదివరలో మతప్రకారము వివాహము చేసుకొన్నవారయినా తిరిగి ప్రత్యేక వివాహ చట్టముక్రింద తమ పేర్లను రిజిస్టరు చేసుకొనవచ్చును.

ఇటీవలనే భారత ప్రభుత్వము ఒక ముఖ్య ప్రకటన చేసినది. కేంద్ర ప్రభుత్వోద్యోగు లెవరును ఒకరికంటె ఎక్కువమంది స్త్రీలను వివాహమాడరాదని, ఈ నిబంధనను ఉల్లంఘించినవారు ఉద్యోగములనుండి తొలగింపబడుదురనీ ఈ ప్రకటనలో స్పష్టీకరించారు. ఈ ప్రకటన బయలువెడలిన తేదీ లోపుగా ఇద్దరు గాని ఇంకా ఎక్కువమంది గాని భార్యలు గలవారు వెంటనే ప్రభుత్వానికి వివరాలతో సహా తెలుపుకొనవలసి ఉంటుంది ఇకముందు ప్రభుత్వోద్యోగులలో బహుభార్యాత్వము నిషేధింపబడిన దన్నమాట. కాని ఇది ఉద్యోగేతరులకు (ప్రజాబాహుళ్యానికి) వర్తించదు. చట్టములో సవరణ చేసిన గాని ప్రజాబాహుళ్యానికి వర్తింప వీలు లేదు. హిందూకోడ్ బిల్లు అన్ని భాగాలు చట్టము చేయబడి సమగ్రమయిన శాసనము అంగీకరింపబడినట్లయితే ఈ బహుభార్యాత్వ నిషేధముకూడా ప్రజాబాహుళ్యానికి అనువర్తింపచేయటానికి వీలు కలుగుతుంది.

ఇద్దరు భార్యలుగలవా రెవరికినీ ఇకముందు ప్రభుత్వోద్యోగాలు లభించవని కేంద్రప్రభుత్వము ననుసరించి కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు కూడా ప్రకటనలు జారీ చేశాయి ఒకరికంటె ఎక్కువమందిభార్యలు గలవారు అఖిలభారత ప్రభుత్వోద్యోగాలకు అర్హులు కారను విషయమును ఉద్యోగుల నియామకపు నిబంధనలలో చేర్చటము ఇటీవలనే జరిగినది. ఈ నిబంధనలు కొత్తగా ప్రభుత్వోద్యోగాలలో నియమింపబడే వారికి మాత్రమే; అదివరకు ఉద్యోగాలలో ఉన్నవారికి వర్తించవు. ఈ నిబంధనలను ఉల్లంఘించినవారు ప్రభుత్వోద్యోగుల ప్రవర్తనా నియమాలను ఉల్లంఘించినవారవుతారని ఈ ప్రకటన హెచ్చరిస్తున్నది.

ప్రాథమిక స్వత్వముల ననుసరించి ఇద్దరు స్త్రీలను వివాహము చేసుకొన్న ఉద్యోగుల సమస్యలలో న్యాయస్థానాలు ఏ విధముగా తీర్పు చెప్పునో? ★

వనితాలోకం:

# మహిళా సమస్యలు

'ఉత్తర'

ఆంధ్రలో ఎన్నికలు అయిపోయినాయి. కాంగ్రెసువారు ఇతర పక్షములతో ఐక్యత సాధించిన ఫలితంగా అఖండ విజయం చేకూరింది. ఐక్య కాంగ్రెసు మంత్రివర్గంకూడా ఏర్పడ్డది. ఈ మహత్తర విజయానికి యావద్భారతవర్షమే గాదు యావత్ప్రపంచం ఆనందించి ఆంధ్రులను అభినందించింది కాని స్త్రీల విషయంగా చూస్తే ఈ యెన్నికలు అభినందించుకోగలవిగా లేవు. 196 స్థానములు గల ఆంధ్రశాసనసభలో ముగ్గురు మాత్రమే స్త్రీలు. ఆంధ్రలో స్త్రీవోటర్లు తక్కువగా లేరు. పురుషులతో సమానముగా ఉన్నారు కొన్ని జిల్లాలలో పురుషులకంటె యెక్కువగా కూడ ఉన్నారు. అయినప్పటికీ నూటికిద్దరికైనా ప్రాతినిధ్యము లభించలేదు. చట్టరీత్యా స్త్రీ పురుషులకు సమాన హక్కులని నిర్వచిస్తూ క్రియలో నూటికిద్దరికైనా ప్రాతినిధ్యం లభించకపోవడం స్త్రీల తక్కువతనాన్ని నిరూపిస్తూ ఉన్నది. ఈమారు ఆంధ్రలో జరిగిన శాసన సభా ఎన్నికలు ఎంతో గణనీయంగా ఉన్నాయి ఐక్యకాంగ్రెసు ఏర్పాటువల్లను, పెద్ద పెద్ద నాయకులు విచ్చేసి చేసిన మహాప్రచారము వల్లను ఇతర పార్టీలపై అభిమానము తగ్గుటవల్లను, కాంగ్రెసుకు మంచి బలం చేకూరింది. అత్యధిక సంఖ్యాకంగా కాంగ్రెసువారు విజయులైనారు ఇప్పట్టున పురుషులే కాదు స్త్రీలను అభ్యర్థినులుగా నిర్ణయించినను గెలిచేవారే, కాని ప్రదేశ కాంగ్రెసువారి ఉపేక్షవల్లను, స్త్రీలు తాము కోరిన స్థానములలో సీట్లు యివ్వనందువల్లను, స్త్రీలు వచ్చే అవకాశం తప్పిపోయింది. ఉదాహరణకు సత్తెనపల్లిలో శ్రీమతి త్రిపురనేని సాధువమ్మగారు అభ్యర్థినిగా నిలువడానికి ప్రయత్నించారు. సత్తెనపల్లిలో అనేక సంస్థలు నడుపుతూ చిరకాలంగా అనేక ప్రజాహిత కార్యాల్లో కృషి చేస్తున్న సాధువమ్మగారు ఆ స్థానమునకు ఎంతో అర్హురాలు. అయినా ఆమె కాసీటు యిచ్చినట్టే యిచ్చి మరల మరియొక నియోజక వర్గానికి మార్చబడింది. దానితో ఆమె హతాశురాలై అసలు అభ్యర్థిత్వమే విరమించుకొన్నది. ఈ మార్పు ఫలితంగా ఒక కమ్యూనిష్టు సత్తెనపల్లిలో గెలవడం సంభవించింది. స్త్రీలకు పలుకుబడిగల స్థానములు దొరకటమే దుర్లభము ఆ స్థానములు మరొకరికిస్తే వారెట్లా రాగలుగుతారు?

ఆంధ్రశాసనసభాభ్యర్థులలో తగినంతమంది స్త్రీలు లేనందుకు భారతప్రధాని విచారం వెలిబుచ్చారు కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ ఢేబర్ గారుకూడా విచారమును ప్రకటించారు కాని ఏమిలాభం? మగవారి అత్యాశలు తగ్గితేగదా స్త్రీలు నిలువగలుగుతారు? ఆంధ్ర శాసనసభలో స్త్రీలకుగల్గిన యీ అన్యాయం తీరవలెనంటే ఆంధ్ర ముఖ్యమంత్రి ఒక స్త్రీని కూడా మంత్రిణి చేయాలె. కాని అట్టి సూచనలు కనిపించవు. ఇప్పటికి నియమితులైన వారందరూ పురుషులే. నియమితులు కాబోవు ఒకరిద్దరి పేర్లుగూడా వారివే వినిపిస్తున్నాయి. ఇట్టి ఉదార సాహస కార్యము ఆంధ్రకేసరికే చెల్లింది. ఆయన మంత్రివర్గంలో రుక్మిణీలక్ష్మీపతి ఆరోగ్యశాఖామంత్రిణి అయింది. ఆమె మంత్రిత్వము నెఱపిన కాలము స్వల్పమే అయినా ఆమెపాలన సమర్థవంతము గాను నిరుపమముగాను ఉన్నదను ప్రతీతి గడించింది. అవకాశమిస్తే స్త్రీలు ఏపని గాని చేయలేకపోరు. పురుషులపాలు పంపిణీల్లో స్త్రీలకు స్థానం లభించడమే దుర్లభంగా ఉంది మొన్న ఆంధ్ర ఎన్నికలలోనూ పురుషులకంటె స్త్రీలే యెక్కువ ఉత్సాహంతో వోటు చేశారని నిండుచూలాండ్రు, పచ్చి బాలెంతలు, పండు ముదుసళ్లు గూడావచ్చి వోటు చేశారని పత్రికలలో చదివాము. స్త్రీలు ఎందరో పసిబిడ్డల చంకనెత్తుకొని క్యూలో నిలబడిఉండటం వార్తల్లోనేగాక ఫోటోల్లో గూడా చూచాము. ఈవిధంగా ఉత్సాహంతో శ్రద్ధతో అభిమానంతో వోటుచేసి తమ్ము గెలిపించిన స్త్రీలయెడ గౌరవభావం చూపి ఉద్యోగాదులిచ్చే సందర్భాల్లో సమత్వము స్త్రీ సమస్యలపట్ల ఔదార్యము చూపినప్పుడే ఆంధ్రమంత్రులు తమ కృతజ్ఞతను వెల్లడించినవారు కాగలరు.

* * *

శ్రీ ఢేబర్ గారు కాంగ్రెసు అధ్యక్షులైనది మొదలు స్త్రీలయెడ ఎంతో గౌరవము

చూపుతూ, దేశవిషయములలో వారి సహకారమును అర్థించడం ముదావహంగా ఉన్నది. ఇటీవల బొంబాయిలో ఇరవై అయిదు మహిళా సంస్థలపక్షమున జరిగిన మహిళా కాంగ్రెసు సమితిని ప్రారంభిస్తూ వారు కావించిన ఉపన్యాసం గాంధీగారి ప్రబోధాన్ని తలపింపచేస్తూ ఉన్నది. మహాత్మాగాంధీ లోగడ స్వాతంత్ర్యోద్యమం నడిపేరోజుల్లో జాతీయోద్యమంలోనూ, నిర్మాణకార్యక్రమంలోనూ స్త్రీలు ఎట్లు పాల్గొని ఉద్యమానికి బలం చేకూర్చినదీ జ్ఞప్తికి తెస్తూ, నేడు దేశపునర్నిర్మాణానికి సాంఘిక పురోభివృద్ధికి స్త్రీలట్లా తోడ్పడాలని అధ్యక్షులు ఢేబర్ గారు చెప్పారు. రాజకీయంగా ఆర్థికంగా స్త్రీపురుషులమధ్య ఉన్న వ్యత్యాసం పోవాలని కూడా వారన్నారు. ఇంగుకొఅకే కేంద్ర శాసనసభలోను, రాష్ట్ర శాసనసభల్లోను, కూడా స్త్రీలకు ప్రాతినిధ్య మిచ్చారన్నారు అధ్యక్షులవారి సూక్తులు మహాత్ముని సూక్తులను తలపుకు తెస్తున్నవి. కాని నూతన రాజ్యాంగచట్టం ప్రకారం స్త్రీలకు ప్రత్యేక ప్రాతినిధ్యం హక్కులు తొలగిపోయిన తరువాత జనరల్ సీట్లలో స్త్రీలు గెలవడం ఎంత దుర్లభమౌతున్నదీ ఢేబరుగారు గుర్తించినట్లు లేదు. సాటిలేని అర్థబలంతోను అధికార బలంతోను పురుషులు స్త్రీలతో పోటీకి నిలబడి వోడించడానికి పూనుకుంటున్నప్పుడు స్త్రీలు ఎట్లా గెలువగలుగుతారు? ఈ పోటీవల్ల స్త్రీలకు సమాన ప్రాతినిధ్యం మాటలతో నేగాని క్రియలో లేదని స్పష్టమవుతున్నది. ఈ అన్యాయం తొలగవలెనంటే, చట్టరీత్యా లేకపోయినప్పటికి కాంగ్రెసువారు అభ్యర్థులను నిర్ణయించేటప్పుడు వారి సంఖ్యకు తగినట్లుగా ఇంతమంది స్త్రీలను తప్పక నిలబెట్టవలెననీ వారిని తప్పక గెలిపించవలెననీ నియమం ఉండి దానిని నిక్కచ్చిగా అమలుపఱచునట్లు చేస్తేనే తప్ప లేకపోతే స్త్రీలకు సమాన ప్రాతినిధ్యమనేది హాస్యాస్పదంగానే ఉంటుంది స్త్రీలకుతగిన ప్రాతినిధ్యం లేనందువల్లనే కేంద్ర శాసనసభలో జరుగుచున్న హింగులో జరుగుచున్న హిందులా సవరణ బిల్లు చీలికలై పేలికలై రసాభాసమవుతున్నది. ఆస్తి విషయంలో స్త్రీలకు సమాన వాటాను యివ్వడానికి వల్లగాదని పోరాడుచున్న సభ్యసోదరులు భార్యవద్ద భరణం పుచ్చుకోడానికి ముందంజ వేస్తున్నారంటే వారి స్వార్థపరత్వం యెంత పెచ్చుమీరి ఉన్నదీ విశదమవుతున్నది. అందువల్లనే ప్రతి సంస్కరణకు రాజశాసనము గాదు కావలసినది, మనః పరివర్తన అంటూ ఉండేవాడు మహాత్మాగాంధీ.

* * *

## వేషభాషలు

దేశంలో నాగరికతకు గురుతు వేషభాషలు. అవి యెంత నిరాడంబరంగా సహజంగా ఉంటే ప్రజలంత సాత్విక ప్రవృత్తి కలవారని వెల్లడి అవుతూ ఉంటుంది. ఈనాటి యువతీ యువకుల వేషభాషల నాగరికతకు సినిమానటుల వస్త్రాద్యలంకారాలు ప్రమాణంగా ఉంటున్నాయి ముఖ్యంగా ఈ అనుకరణ, నాగరికత నేటి యువతులను అత్యధికంగా భ్రమ పెట్టడం విచారకరంగా ఉన్నది ఈ పోకులు చేసుకొనే మోజులో యువతులు కేశాలంకారణలోనేమి, వస్త్రధారణలోనేమి, సౌందర్యపోషక విలేపనాదులు, రంగులు అలదుకొనుటలోనేమి, స్త్రీ సహజ మర్యాదలనే విడనాడుతున్నారు. వారు చేసుకొనే అలంకారాలు సినీమాతారలవి, వారు చదివే పుస్తకాలు సినిమా నటులను గురించినవి. వారు చూచే చిత్రములు యువతీ యువకుల ప్రేమలీలలను గురించినవి. సినీమా తారలను గురించి, సినీమాలనుగురించి యీనాటి యువతీ లోకము తెలుసుకున్నంతగా మరి దేనిని గురించి తెలుసుకోవడం లేదంటే అతిశయోక్తి లేదు. నీతికరమైనవీ, విజ్ఞానప్రదమైనవీ, అయిన సినిమాలను అప్పుడప్పుడు చూస్తే తప్పు లేదు. ప్రయోజనం కూడా ఉంటుంది. కాని యీనాటి యువజనులు వచ్చిన సినిమా నెల్ల డబ్బు దండగ చేసి చూడటమే కాకుండా దానివల్ల నైతికమైన విలువలను కోల్పోయే పతనస్థితికి వస్తున్నారంటే అది యెంతైనా విచారించవలసిన విషయం. ఈ సందర్భాన మన కాంగ్రెసు నూతనాధ్యక్షులు యు యన్. ఢేబర్ గారు పశ్చిమ బెంగాలు విద్యార్థి యువజన మహాసభను ప్రారంభిస్తూ చేసిన ప్రసంగం ఎంతో కొనియాడతగినదిగా ఉన్నది.

"ఈనాటి విద్యార్థుల వేషభాషలు తీరుతెన్నులు శిరోజములు తీర్చిదిద్దుకొనే పద్ధతులు చూస్తే వీళ్లంతా సినీమాతారలని భ్రమించక మానరు. నేటి విద్యార్థులు సినీమా వ్యవహారాలనుగురించి కూలంకషంగా తెలుసుకొని అందు సునాయసంగా అగ్రతాంబూలమందుకుంటున్నారు. అసలు యీనాటి విద్యార్థిలోకంలో అత్యధిక సంఖ్యాకులు అనవరతం పారాయణ చేసేది సినిమాలను గురించిన పుస్తకాలో, అపరాధ పరిశోధక సారస్వతమో మాత్రమే.

మామూలుగా విద్యార్థులు బడి వదలగానే సినిమాలకు పరుగెత్తుతారు. కుటుంబ పరిస్థితు లెట్లా ఉన్నా పట్టించుకోరు. దేశవ్యాప్తమైన కమ్యూనిజం, సోషలిజం, గాంధీయిజములనుగురించి ఏమీ తెలియకపోయినా సినిమాలను గురించి ఏ ప్రశ్న అడిగినా తొణకకుండా చెప్పేంత తూర్ణంగా తెలుసుకుంటున్నారు" శ్రీ ఢేబర్ గారు వచించిన యీ విషయాలు అక్షరాలా నిజం. నేటి యువజనులను గురించి శ్రీ ఢేబర్ గారు ఎంత కూలంకషంగా తెలుసుకున్నారో అక్షరలక్ష చేసే పై సూక్తులు వెల్లడిస్తున్నాయి నేటి సినిమాలో

వనితాలోకం:

# మన విద్యావిధానమూ 

# ★ మా ఆవిడ వుపన్యాసమూ

స్వోత్కర్ష అన్నా ముఖస్తుతి అన్నా నాకు బొత్తిగాగిట్టదు అయినా ఒక్క విషయంమట్టుకు చెప్పక తీరదు ఏమంటే-మాఆవిడ కమల వుందిమాశారూ-అసాధారణమైన తెలివితేటలు గలది మా కుటుంబంలో తక్కినవాళ్లందరూకమలఅదృష్ట వంతురాలనికూడా అంటారు - కాని ఎవరి నోట యీమాటవిన్నా నా మనస్సు చివుక్కు మంటుంది నా చదువునూ, తెలివితేటలనూ చివరికి నా అస్తిత్వాన్ని పూర్తిగా విస్మరించి నా అదృష్టానికి నేను ఎంతమాత్రం కర్తనుకాదనీ - రెండు వసంతాలక్రిందట మాత్రమే మా గృహంలో అడుగుపెట్టిన ఆవిడదే ఆఅదృష్టమనీ నావాళ్లే నిస్సంకోచంగా నిశ్చయిస్తుంటే - ఒకటి, నా ఆత్మాభిమానం దెబ్బతినటమూ, రెండు, కమలముందు లోకువ అయిపోయి చివరికి మా కుగ్రామంలోనే యితగాడు ఎవరూ అంటే - కమలమ్మ మొగుడూ అనిపించుకునే అవస్థ పట్టవచ్చుననే భయమూ కలిగాయి నాకు

ఇంతకీ యిందుకు కారణం లేకపోలేదు కమల తొలిసారి మాయింటికోడలుగా మా వసతిగృహంలో శ్రీపాదంమోపిన పక్కా అయిదుఘడియలలోపునే నన్ను తమ జిల్లా బోర్డు హైస్కూలులో లెక్కల పంతులుగా నియమించినట్లు శ్రీ డిస్ట్రిక్టుబోర్డు వారివద్దనుంచి వుత్తరువులు రావటమూ - వెంటనే మా అమ్మ ఒక్కసారిగా కోడల్ని కావలించుకొని "మా-మాలక్ష్మి అంటూ ఆనందాశ్రువులు రాల్చటమూ సంభవించింది మానాన్న "నాకోడలు అదృష్టం వచ్చిన నాడే వేరింటికాపురంమట్టుకు అందరికీ అందుబాటులో వుంటుందా!" అని అన్యాపదేశంగా మా అమ్మని వెక్కిరించారు కోడలు

## గొల్లపూడి కేశవరావు

కమలని పొగడటమూ, కూతుర్ని దిగబెట్టటానికివచ్చిన మా అత్తగారు యీ అవకాశం అందిపుచ్చుకొని యీ కూతురుపుట్టిన దర్మిలా తమకు చాలావిషయాల్లో ఎల్లా కలిసివచ్చిందీ అనర్గళంగా అరగంట వుపన్యసించారు ఈవార్తవిన్న పక్కింటిపుల్లమ్మ, పొరుగింటి పున్నమ్మ అందరూ ఏకమై "కోడలువచ్చిన వేళావిశేషం - కొడుక్కి దొరికిన వుద్యోగం' అంటూ మా అమ్మతో నేను వింటూవుండగానే చెప్పటం ఇదంతా చూస్తే వీరందరూ ఒకటై నా నామరూపాలకి మంగళహారతి పాడుతున్నారా అనిపించింది

పోనీ నేను సంపాదించిన వుద్యోగం చూసినా అంత గొప్పదికాదే బి.ఎ ఫస్టు క్లాసులో పాసుకావటమేమిటీ వెధవ స్కూలుమాష్టరీ ఏమిటీ అని నేను ఒకపక్క మనస్సులో మథనపడుతూవుంటే, వీరంతా కమలదె యీ ప్రయోజకత్వం అంటూ నన్ను కేవలం నిమిత్తమాత్రుణ్ణిగా చేయటమూ కమలపరంగా అదృష్ట గీతాపారాయణం చేయటమూ నాకు ఎక్కడలేని సిగ్గూ అభిమానమూ కలిగించాయి

"అసలు నా కీస్కూలుమాష్టరీ వద్దో" అంటూ అప్లికేషను పెట్టేనాడే మొండి చరిచాను కాని మా నాన్న కుటుంబ ఆర్థిక పరిస్థితుల్నీ, నాబాధ్యతల్నీ, యీ వుద్యోగంలోవున్న లాభాల్నీ కూలంకషంగా సమీక్షచేసి నాకో సుకతరబాధ్యతని అంటగట్టటంద్వారా కర్తవ్యోన్ముఖుణ్ణి చేశాడు - పోగా యిది ఏతావాతా తెంపరరిపోస్టు! క్షణభంగురమయిన నాయీ అదృష్టరేఖని నాకు కాకుండా దోచుకుపోయి కోడలు కమలపరంచేస్తూ అందరూ వల్లమాలిన వంది మాగధస్తోత్రం చేయటం నాకు మహా చెడ్డ తలనొప్పి కలిగించింది

ఏమైతేనేమి కమలనీ కొత్తకాపురాన్ని వెంటేసుకుని షుమారు రెండేళ్లు స్కూలు మాష్టరీ వెలిగించాను

*     *     *

ఆరోజున యిహ స్కూలుకు పోతూవుండగా మెల్లిగా పక్కనచేరి "ఈసారి మీకు తప్పదు' అన్నది మోహనరాగంతో కమల

"ఏమిటీ తప్పనిది?" ఆమెకేసి చూస్తూ ప్రశ్నించాడు

"అమ్మ చీరకోసం యీనెల యిరవై రూపాయలు సెలవుచేయాలి" నవ్వు దాచుకుంటూ అన్నది కమల వాళ్ళ నాన్న మద్రాసులో వుద్యోగం చేస్తూవుండగా నేర్చుకున్న అరవతెనుగు దవిచూపిస్తూ సొగాలు సిగ్గుతో అతిప్రయత్నంమీద దాచుకుంటూన్న కమల నవ్వు అసలు విషయం స్ఫురణకు తెచ్చింది నూడిదయివ్వటానికి ఫలానారోజుకు వస్తున్నామని వాళ్ళ అమ్మరాసిన వుత్తరం

కాని అసలు వచ్చిన చిక్కు ఏమిటంటే యీనెల వుత్తరార్ధంలో అర్ధాంతరంగా కమల కోరిన కోరిక కాదనటానికి వీలులేనిదే అయినప్పటికి అప్పుచేయాల్సిన అవసరం కనపడటంతోటే శేషవిశేషాలు తెలుసకోవాలనే వుత్సుకత చంపుకొని చొక్కా తొడుక్కుంటూనే అన్నాను

"చూద్దాం"

నావంక చిరుకోపంతో చూస్తూ గిరుక్కున వెనక్కి తిరిగి వంటింటి గుమ్మం దాకా పోయి నిలబడి అన్నది కమల—

---

వినోదం ఉండవచ్చును, విచిత్రం ఉండవచ్చును కాని నీతినిగాని విజ్ఞానాన్నిగాని ప్రసాదించేవిగా మాత్రంలేవు ప్రతివారు వచ్చిన ప్రతిసినిమాను చూడటం తప్పని సరి అని భావించే యీ దినాల్లో సంఘ శ్రేయస్సుకు, దేశశ్రేయస్సుకు మానవశ్రేయస్సుకు ఉపకరించే సినిమాలే విడుదలయ్యేటట్లు చూడటం ప్రభుత్వంవారి బాధ్యతై ఉన్నది. హత్యలు, దొంగతనాలు, దారిదోపిళ్లు వికృత ప్రణయాలు ప్రేరేపించే కథలు విద్యార్థులు విద్యార్థినులే కాదు ప్రజానీకమే చూడరానివి ప్రభుత్వాధినేతలు వీనిని గమనించుట అవసరము కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ ధేబర్ గారు నేటి పరిస్థితులను గురించి యింత సూక్ష్మంగా పరిశీలించి యువజనులను ఉద్బోధించినందుకు వందనీయులు వారి అభ్యర్థన మన మాతృభూమి నైతికవిలువలను హెచ్చించుకోగలదని ఆశించుదాము ★

"ఇహనేం - మహా చక్కగా చూసే తీసుకు రండి మంచిది" కమల గాంభీర్యం గురించి యింతలో నేనేమీ చెప్పదలుచుకో లేగు అయితే కమల ఏనాడూ తనకు యిది కావాలీ అని నన్ను కోరని ఆదర్శగృహిణి అవటంవల్ల ఆమెకు కష్టంకలిగించటం యిష్టంలేక అన్నాను

సరేలే చౌదరమ్మగారినడిగి అప్పన్నా తెస్తాను' అని పోతూనే జవాబు చెప్పాను

చౌదరి అంటే మాకో టీచరు అవసరానికి ఆంధ్రాబాంకులాంటివాడు మనమంటే కొంచెం "మెత్తని మూల"కూడా వుంది ఈనెల కొన్ని అనివార్య పరిస్థితులవల్ల వచ్చిన జీతం కాస్తా వ్యయమవటంతో మరీ యిబ్బందిగావుంది ఈ ఆలోచనలతో హెడ్మాష్టరుగదిలో ప్రవేశించి అటెండెన్సు రిజిష్టరులో సంతకం పెట్టబోతూ వుండగా ఆయన అన్నాడు యింగ్లీషులో!

"మాష్టారూ - నాకు చాలా విచారంగా వుంది

నాకు విషయం అంతుపట్టకముందే రాజమ్మగారు అంటే మా స్కూలు ఏకైక వుపాధ్యాయిని "శెలవల జీతం ఎగవేయటానికిగాను ఎంతపని చేశారూ" అంటూ సాగదీసుకుంటూ విచారం వెలిబుచ్చుతూండగా నే,

ఈ విషయం కాస్తా చెప్పేం ప్రథమ తాంబూలం యీవిడ ఎక్కడ అందుకుపోతుందో అని నేనంటే కాస్త గుర్రగా వుండే శేషయ్య తొందరపడి కుండ బదలు కొట్టాడు,

"మిమ్మల్ని కాస్తా వూస్టుచేశారు' అంటూ తృప్తిగా హెడ్మాష్టరు వంక చూశాడు

ఇంతటి కర్ణకఠోరమైన విషయం తన నోట బహిర్గతం కానందుకు తృప్తిపడుతున్నాడా అనుకొనేవిధంగా ఆ వృద్ధగురువు దీర్ఘనిశ్వాసం వెలిబుచ్చాడు

మీరు లేకపోవటం యీ సమయంలో మాకు చిక్కే ఈ పేపర్లు అన్నీ ఎవరు దిద్దుతారో నాకైతే ఏవీ తెలియటంలేదు" అంటూ సానుభూతి చూపాడు ఆయన

"స్కూలు మూడురోజుల్లో మూసుకుంటారనగా ఏమిటీ వూస్టింగులు అని చౌదరిగారు అంటంతో ఆయనవంక చూడగానే కమలకిచ్చినమాట గుర్తుకువచ్చింది

ఈనెల జీతానికి కూడా ఎగనామం పడుతూవుండగా ఆయనగార్ని ఏమని అప్పు అడిగేను! కమల కిచ్చినమాట ఎల్లా తీరవేయను!!

ఈవిధంగా కమల తొలికోర్కెకు మా బోర్డువాళ్లు అకారణంగానూ అజ్ఞాతంగానూ విఘాతం కలిగించటంతో — ఒకప్రక్కన నా 'భావి ని గురించీ—మరొక ప్రక్కన కమలకు యీరోజున కలిగే విన్నబాటును గురించీ తర్కించుకుంటూ యింటికి దారితీశాను

అప్పటికి ఇంకా మధ్యాహ్నం నాలుగు గంటలు కాకపోవటంతో నా యీ రాక కమలకు ఏదో వింతగా తోచివుంటుంది అందుకనే అన్నదిగదా

"ఈ పూట అయిదు పీరియడ్లు స్పేరా" అని అంటే అవసరమయినపుడు మార్నింగు క్లాసు ఒక పీరియడు పెంచి వదిలిపెట్టటం సాధారణంగా బోర్డుస్కూళ్లకు ఏమీ కొత్తగాదు అందువల్ల ఆమె అపోహపడ్డది గాని ఆరోజున ఆమెకూ నాకూ ఎంతటి తీవ్ర అపచారం జరిగిందో ఆమె కేమి తెలుసు? ఇంతకీ యీ వుత్తరువుల్లాలు ఎంత నొచ్చుకుంటుందో తెలియక నేనెగా మా ఏ కొందరపడి తొలగింపు ఫర్మానా జారీ చేశారు ఇంతటి ఘోరమైన విషయాన్ని కమల మనస్సుకు నొప్పి కలిగించకుండా చెప్పట మెల్లగా అని ఆలోచించి అన్నాను—

"ఇటు చూడు కమలా" అని జేబులోకి చెయ్యి పోనిస్తూ—ఎచ్చికమల చౌదరిగారు డబ్బు యిచ్చాడని భావించివుంటుంది వికసితవదనంతో నా చేయివంకా జేబువంకా చూస్తోంది కమల—అశోక ధర్మచక్ర ముద్రిత కరన్సీకాగిత దర్శనోత్సుకతతో ఆహా యిటి కమలమ్మ కళ్ళకు పూలగు ఆర్డరు చూపించబోయే నా గురదృష్టాన్ని నిందించుకుంటూ అన్నాను

"ఇదిగో యీ కాగితం చూశావా' అని-

కమలకి వుండుకున్న కోపం హాగు మీరిపోయింది ఆగ్రహావేశంతో వుడికిపోయి అన్నదిగదా

"ఆ చూడక ఏం చేస్తాను—తెల్ల కాగితంమీద రెమింగ్టన్ తో ఎవడో అభాజనుడూ— అంటూనే నా మొహం చూసి ఆగిపోయింది

ఇంతకీ ఆ గుమాస్తాను తిట్టటం కేవలం అన్యాయం!

క్షణంలో సగుకుని నా చేతిలో కాగితం చేసాచి అందుకుంది కమల కురంగంలా గెంతి

ఈ దురన్యాయాన్ని కమల ఎలా భరిస్తుందా ఏమంటుందా అని ఆమె వంక జాగ్రత్తగా చూస్తున్నాను, ఓ పెద్ద మనశ్శాస్త్రవేత్తలా—

కమల గోధుమవన్నె వదనం మొదట తెల్లబడింది తరువాత క్రమేణా ఎఱ్ఱబడి అస్తమించే సూర్యుణ్ణి అనుకరించింది ఇహ చీకటి తెరలు క్రమ్మి విషాద సాంధ్యగీతికలు వినిపిస్తాయి గావల్నని నేను అనుకుంటూ వుండగానే, ద్వేషం చిలకబోస్తూ కాగితాన్ని విసిరికొట్టి అన్నది కమల

"వుండండి—పొద్దునే కాఫీకి కుంపటి అంటించటానికన్నా పనికివస్తుంది"

ఎంతో ఆశతో వుండగా లోటు బడ్జటు చూపాల్సివచ్చిన ఆర్థికమంత్రిలా షాక్ అనుభవించాను ఎంత నిర్లక్ష్యంగా - అయినప్పటికీ ఎంత సమయోచితంగా ప్రవర్తించింది!

కమల మనస్సులో బాధపడటం లేదని నేను అనలేను—కాని యీ సమయంలో నిసలైన భారతనారికుండే ధైర్యమూ, సహనమూ చూపింది ఇట్టి సహనం చూపే వ్యక్తి నాకు యిప్పుడు ఎంత అవసరమో—నా కమల తన మనో నిబ్బరంతో నా యీ భగ్న జీవితనౌక తాలూకు చుక్కాని నిశ్చలంగా చేత ధరించి ధైర్యంతో నావను గట్టుదిక్కుగా నడుపుతూంగా అట్టి సహకారమూ సహనమూ ఎంత మందికి లభ్యమవుతుంది?

కమలమీద నా గౌరవమూ అభిమానమూ యిబ్బడిగా పెరిగాయి గాంధీమహాత్ముడు తనకు వచ్చిన వుత్తరాలలోని గుండుసూదులు భద్రపరిచేవారుట! బ్రతికివుంటే కమలయొక్క బుద్ధిసూక్ష్మతకి ఆ మహానుభావుడు ఎంత సంతోషించేవాడో ఇంతలోనే నాలో కొంటెతనం రేగింది కమల వదనసీమలో విచారపు నీలి మేఘాలు చూడాలనే ఆకాంక్షతో ఆమె సున్నితమైన హృదయంపై నా వాచాలత్వమనే సమ్మెటపోటు వేయటానికి జంకలేదు

"మరి నీ చీరవిషయమో" - అర్ధోక్తిలో ఆగి ఆమెవంక చూశాను కాంతిలేని నవ్వు నవ్వింది కమల ఆమె వూహాలు ఎంత దూరం పోయాయో వూహించాలంటే అది నాకు సాధ్యంగాని విషయమే

"సరే యిప్పుడా మాట దేనికి - రవికల గుడ్డ చాలు"

ఆహా కమలా ఏమి నీ సమయస్ఫూర్తి అని మనసారా లోపల గొణుక్కున్నాను ఇటువంటి సహధర్మచారిణి సహాయంతో ఎంత వూస్టింగు ఆర్డర్లు వక్కసారే వచ్చినా నిభాయించుకో వచ్చుననే దిలాసా ఏర్పడింది కాని ఓటమి అంగీకరించటం ఎంతమాత్రం యిష్టంలేక అన్నాను

"కాని నష్టపోవాల్సివచ్చింది గదా అని నా బాధ"

"నష్టమా! దేనికండీ?" అన్నది అమాయికంగా

"బలేదానివి! సమ్మర్ సాలరీ ఎగవేయటానికే గదా యింతలో శ్రీముఖం పంపింది" కమల యీ దెబ్బనుకూడా తట్టుకుంది ఎంతో నేర్పుతో తన విచారాన్ని హాస్యరస వాహినిలో ముంచెత్తేలా

"సమ్మర్ సాలరీతోపాటు అమ్మకు సారీకూడాను" అన్నది పేలవంగా నవ్వుతూ!

ఇందులో వున్న ద్వంద్వార్థాలు మా

(30-వ పేజీ చూడండి)

చూస్తుంటే నాకు ఎంతో ముచ్చట అయింది. కమల యీ సమస్యని అతి వాస్తవిక దృక్పథంతో, యింతవరకూ ఏ మహానాయకుడూ, రాజకీయ వేత్తా తరిచి చూడని కొత్తపోకడతో పరీక్ష చేయటం నా వుత్సుకతను మరింత ఎక్కువ చేసింది. కంటిన్యూయిటీ పోకుండా వుండేందుకుగాను రెట్టించి అన్నాను.

"చెప్పు కమలా చెప్పు"—

కమల నావంక అదోలా చూచి అంది.

"సరే దీనికి వప్పుకున్నారు కదా - తను వాటి అతను దరఖాస్తు చెయ్యని వుద్యోగం అంటూ లేదు. పోయి చూడని యింటరూవ్యూ లేదు. ఇందులోకూడా దోషార్హులు యిద్దరున్నారనే విషయం అంగీకరిస్తారనుకుంటాను"—

"అవును—కానీ—" కమల నామాట ఆపి వెంటనే అన్నది.

"రెడ్డెమ్మ అల్లుడు చాలా నిజాయితీ మనిషి—యీనాటికీ అతణ్ణి లోకం అసమర్థుడంటున్నా మోసగాడు అంటం లేదు. అప్పులు తీర్చాలిసిన అదను రాగానే అతను భార్యనగలు కాస్తా కాజేద్దామని చూశాడు."

"కాజేద్దామనా!" కమల వాడిన యీ మాటకి ప్రతిపక్ష నాయకుడిలా వాడిన మొహంతో అభ్యంతరం చెప్పాను. "ఈ మాటమీద అసెంబ్లీలో అయితే సాగేదాకా లాగేవారు. నువ్వు చెప్పిన యిన్ని విషయాలలో ఏకీభవిస్తూ కూడా యీ చివరి మాటకి నా తీవ్ర అసమ్మతి తెల్పుతూ—" అంటూ లేవబోయాను వేడుకకి.

"పుణ్యముంటుంది - వంటా అదీ పూర్తి అయింది. బయటికి మాత్రం పోమాకండి. వెడితే యిప్పట్లో రారు కూడాను బాబూ" లాలనగా స్పీకరు రూలింగు యిచ్చింది కమల. నన్ను మాట్లాడనివ్వకుండా వెంటనే అన్నది— "ఇంతలోనే చిన్నబుచ్చుకున్నారే! ఆ సొమ్ము ఎవ్వరిదని? అయితే నాకు తెలియక అనుకోనూ—దస్తులు రాసి యిచ్చిం తరువాత నా యిష్టం వచ్చినప్పుడు తీసుకుంటాను అంటే చెల్లుతుందా—" అని కొంచెం ఆగి ప్రశ్నించింది. "—ఊఁ—చెప్పండి మాట్లాడరేం." ఏమి చెప్పను? ఈ ప్రశ్నకి సరియైన సమాధానం యిస్తే నా కోపం దుర్నిగ్రహంగా చిరాకులో అయ్యే ప్రమాదం వున్నది.

"నువ్వు చెప్పింది కాదనను—కాని ఒక్కమాట - యింతవరకు రెడ్డెమ్మ అల్లుణ్ణి యింత సింపతైజ్ చేశావే. యిప్పుడా జాలి ఏమైంది? భార్య సొమ్ము అపేక్షించాడనే గదా క్షణంలో నీ హృదయం కరుడు వారిపోయింది. అయితే అతని దుస్థితిని గ్రహించిన భార్య ఆ పరిస్థితుల్లో ఏమి చేయాలి



తిరుమలనాయకుని మహల్ లోకప్పు పైశిల్పం

చెప్పు?" ఇప్పటికన్నా కమల లొంగక పోతుందా అనే దిలాసాతో అడిగాను.

"దీనికి రెండు జవాబులు వున్నాయి. రెండు విధాలుగా యీ విషయం పరిశీలించాలి. ఒకటి - మీరు నావద్దనుంచి ఏ జవాబు అయితే అపేక్షించారో అది—కానివానివల్ల ఏమి లాభమూ అని నేను అనుకుంటున్నాను - అప్పు తీర్చి నువ్వు గడుపుకోగలతే కాని సంసారాన్ని ఎల్లా బాగు చేస్తాడు? పోతే, యిక యివ్వటమూ మానటమూ అనేది పూర్తిగా ఆవిడ నిర్ణయానికి వదలవలసిన విషయం - కాదంటే ఆమెని దండించటానికి వీలు లేదుగదా - ఈ పరిస్థితుల్లో అతను చేసిన పని పూర్తిగా గర్హనీయం—"

కమల తన ఫైండింగు యిచ్చేసి వూరుకున్నది. ఇంతటి తీవ్రవిషయంమీద ఎంతో ఘనమైన నిర్ణయం చేసినట్లుగా ఆమె అనుకుంటే అనుకోవచ్చుగాక—కాని నాకు వున్న సందేహాలు మనస్సులో వేదన కలిగిస్తూనే వున్నవి.

"ఐతే యీపరిస్థితులే నాకు తారసిల్లితే ఏమి చేయమంటావూ?"

కమల తలయెత్తి నాకళ్ళల్లోకి చూసింది. ఈ మాటలు నేను వేళాకోళానికి అనలేదని ఆమె గట్టిగా గ్రహించింది. ఆమె చెప్పిన విషయాలు నాకు ఎంత బాధ కలిగించాయోనని ఆమె అనుమానం కూడా పడివుంటుంది.

"మీకేమండీ! లేకపాటికి పిల్చి వుద్యోగమిస్తారు." ఎంతో ధీమాగా అంది.

నా ప్రయోజకత్వంమీద ఆమెకు యింత గట్టి నమ్మకం వుండటం సంతోషించతగ్గదే గాని, యింతటి నమ్మకం పరాయివాళ్ళకి వుంటుందని ఎలా అనుకోను! కమల నా మానసికాందోళన గ్రహించింది—అందుకనే సంభాషణ ఆపేసి

"స్నానానికి నీళ్లు తోడుతున్నాను లేవండి" అన్నది.

సంభాషణ యింతటితో తెగిపోయింది. ఈమూ తర్కంవల్ల నాకు వాస్తవానికి ఎట్టి లాభమూ కలగలేదు. కాని వక్క సంగతి మట్టుకు గ్రహించాను. ఏమంటే తెలివితేటలు ఏ వొకడి సొమ్మూ కావనీ, చదువుకూ బ్రతుకు తెరువుకూ ముడిపెట్టటం ఎంత అపసవ్యమో, చదువుకూ తెలివితేటలకూ జతకూర్చటం కూడా అంత అసంబద్ధమేనని. మేధోవికాసంగల మహానాయకులు అనేకులు యీ చదువు నిరుపయోగ

# ★ మన విద్యావిధానమూ - మా ఆవిడ వుపన్యాసము ★

మైనవని ఉపన్యాసాలు యిస్తున్నారు. అందుకు వేరే ప్రత్యక్షనిదర్శనం అవసరమే లేకపోతోంది. యూనివర్సిటీ డిగ్రీల కోసం ఎగబడి జీవితంలో బోర్లపడే వారిని హెచ్చరిస్తూ యిచ్చిన యీ సలహా యీ పరిమితికే కట్టుబడివుంటుందేగాని, మార్గాంతరం సూచించబడకపోవటం కేవలం మన దురదృష్టం వల్లనే.

స్నానమూ భోజనమూ అయిన తరువాత గాని ఆరోజు పేపరు చూడటానికి వీలు కలుగలేదు. వాలుకుర్చీలో మేను వాల్చి కమల యిచ్చిన తాంబూలం బుగ్గను తాటించి పేపరు తెరిచాను. "రెండవ పంచవర్ష ప్రణాళికలో నిరుద్యోగసమస్య నిర్మూలన" అని ఓ వార్త - దానికి రెండు కాలాల అవతల "బెంగాలులోని పది తాలూకాలలో ప్రాథమికోపాధ్యాయుల్ని తగ్గించనున్న"ట్లు మరో వార్త! రెండు పేజీలు తిప్పగా "గవర్నమెంటు వుద్యోగాలకోసం ఎగబడటం నామర్దాపని" అని నెహ్రూ పండితుని హితవు. ఆ పేజీలోనే మూల "నిరుద్యోగి ఆత్మహత్య" అనే ఓ చిన్న హెడ్డింగుచూసి వాస్తవంగా బుఱ్ఱ తిరిగిపోయింది. వీటిని సమన్వయపరచటం ఎలాగా అని విస్తుపోయి నేనుండగా, ఎప్పుడు ప్రవేశించిందో నా వెనకనుంచి కమల——

"ఇంతకీ పంతులుగారి ప్రభుత్వం నిలిచేనా!" అని అడిగింది.

అయితే పొరపాటే కావచ్చుగాని నాకున్న కాస్త సహనమూ పోయింది.

"నిలిచి ఎవర్ని వుద్ధరించను" అనటానికి సాహసించాను. కమల రాజకీయాభిప్రాయాల్లో పూర్తిగా ప్రభుత్వ పక్షం!

నేను చదివి వినిపించిన పై విశేషాలు యావత్తూ విని కమల విరగబడి నవ్వింది.

ఆపైన అన్నదిగదా "మీ భయంచూస్తే నాకు ముచ్చట అవుతోంది"

"ఓ యబ్బో నీ ధైర్యమూ నువ్వూనూ - పోయి ఆ దీపాన్ని అడుగు"

ఏమంటే మా యిద్దరిమధ్యా ఏనాడో జరిగిన వక సంగతికి యీ దీపమొక్కటే ఏకైక సాక్షి. ఆనాడు గోడమూలని అంటిపెట్టుకున్న పాముని కొట్టాను! అది దెబ్బ తప్పించుకొని క్రింద పడగానే దీపం చూపుతున్న కమల గావు కేక పెట్టి దీపంతో సహా దౌడుతీసింది - నన్నా పన్నగం కటాక్షవీక్షణాలకి వదిలేసి!

అతిశక్షంమీద మునిపళ్ళతో పెదాలు నొక్కిపట్టి నవ్వుదాచుకుంటూ అన్నది కమల. "అవునా! ఈ వార్తలు చూసి మీ రెందుకు యింత బాధపడతారు! ఈ పళాన మీరే ఒక గెజెటెడ్ ఆఫీసరు అయివుంటే యీ వార్తలు రవ్వంత అయినా మీకు బాధ కలిగించేవా? ఇంత స్వార్థపరులై యుండి కూడా యింతలోనే యితరులకు ఆ దోషం ఆరోపించటానికి సంకలేకే మీరు" అని ఆగి సెలవివార నవ్వుతూ అన్నది. "మీ సంగతి తెలిసిపోయింది లెండి" అని.

నా మాటలలోనే నన్ను పట్టీకొట్టించి నవ్వుతున్నది కమల. సత్యమనే సూర్యరశ్మి సోకగానే అరవిచ్చిన కమల ముఖకమలం నుంచి అంతవరకూ పట్టుపడి - పారిపోయే భ్రమరాల తాలూకు పక్షయుగ్మాలులా నా కనురెప్పలు రెపరెప లాడాయి. ఆ రెక్కల క్రింద తోపించే నీలిమకూడా స్ఫుటంగా నా కళ్ళల్లో కమల చూచేవుంటుంది.

ఈ విధంగా హ్రీ రమ్యుడనై యున్న నన్ను చూసి కమల ఎంతో ముద్చటపడి పంచమ స్వరంతో పకపకా నవ్వింది.

ఇల్లాలి ముందు అమాయకత్వంతాలూకు సిగ్గు నభినయించటంలో కూడా యింత ఆనందం వుంటుందని అప్పుడుగాని నాకు తెలియలేదు. వెంటనే సంబాళించుకొని అన్నాను.

"యూనివర్సిటీ విద్యపై నీ సలహా వుచితంగా యిచ్చావు గదా యిందాక - యిప్పుడు యింతకీ నైహూ పండితునికి ఏవన్నా సలహా యివ్వగలవా" అని పూర్వ మీమాంస చేశాను.

"నాకైతే ఆయన చెప్పేదాన్లో లేశమూ పొరపాటు కనపడటంలేదు అయితే మార్గాంతరం చెప్పకపోవటంవల్ల 'అర్జునుడు; గర్భస్థుడైయున్న అభిమన్యుడికి పద్మవ్యూహాన్ని గురించి' చెప్పినట్లుగా ఏకపక్షమే అయి, వ్యూహ విచ్ఛేదన మార్గం కనపడకపోవటంతో - యిది ఒక మహా విజ్ఞునియొక్క కలవరింతగా లోకులు భావించవచ్చు." తన వుద్దేశాన్ని మరొకరి వుద్దేశంగా సూచిస్తూ మన నోరు తక్కున మూయించే - మా కమల వాక్చాతుర్యమే అంత! అయితే నాకు వుండుకున్న తెలివితేటలు అన్నిటినీ జాగ్రత్తగా సేకరించుకొని అన్నాను.

"చెప్పకేం - ఆయన ఆ విషయాలూ యిదివరలో ప్రస్తావించారు. అసలు యీ విద్యావిధానమే తప్పుల తడక అనీ, గాంధీగారి సర్వోదయసిద్ధాంతాల బాపతు అదేమీ.. బేసిక్... చేతిపనులూ అవీ అని చెప్పారు."

ఇది తన్ను మోసగించటానికి నేను ప్రయోగించిన సమ్మోహనాస్త్రమని గుర్తించింది కమల. అందుకనే చిరునవ్వు దాచుకుంటూ అన్నది.

"కావచ్చు..ఒక్క విషయంలో ఆయన తెలివితేటలు మీ తెలివితేటల్ని మించి దాటలేదు! దేనికంటారా, యీ విద్యావిధానం ఒక సమస్యని పరిష్కరించలేదని యిద్దరూ అంటున్నారు. అయితే ఆ సమస్య ఎందుకు వుత్పన్నమయిందో ఎవ్వరూ ఆలోచించటంలేదు. గత ప్రపంచ సంగ్రామంయొక్క బోగా మిగిలిన దుష్ఫలితాల పరిణామమే యీ సమస్య అనీ, పోగా పరాయిపాలనలో మన దేశం, జనాభాలోతప్ప తక్కిన ఏ విషయంలోనూ పురోభివృద్ధి పొందలేదనీ మీరు విస్మరిస్తున్నారు." కొంచెం ఆగి ఆమె అన్నది "దేశం అభివృద్ధిపొందాలి..సర్వతోముఖంగా" ఈమాటలు అంటుండగా కమల కాంతివంతమైన కళ్లు వినీలాకాశంలోకి క్రొంగ్రొత్త కాంతి వెదజల్లుతూ ఎగబ్రాకే జ్యోతి నిర్మయ తారకల్లా ప్రకాశించాయి.

నిర్భయంగా నిర్మొహమాటంగా ఒక సత్యాన్ని - అది నిర్భరమే కావచ్చు దాచకుండా చెప్తోంది కమల. నా వ్యాఖ్యానం చేరిస్తే ఆమె సమయస్ఫూర్తి చెడిపోవచ్చు. అందుకని మెల్లిగా అన్నాను "ఆమాట నిజమే"...అని.

"కాని ఒక చిన్న సంగతి మట్టుకు దాచకుండా చెప్తాను. ఈ విద్యావిధానం తప్పుల తడిక అని తెలిసికూడా, హిందీ, యింగ్లీషు, తెలుగు భాషల వ్యాకరణాలనే కత్తెర బోనుల మధ్య పెట్టి తెలియని పసికందుల్ని నొక్కేసే పద్ధతికి ఎంత తొందరగా స్వస్తి పలికితే అంతమంచిది. భవిష్యత్తు అనే పకోడీల వాసనకి యీ పసిపిల్లలు చుంచుల్లాగా, ఎలకల్లా యీ బోనులలో చిక్కనాశనమవుతూంటే ఒక దేశభాష, రాష్ట్రభాష, అంతర్జాతీయ భాష, క్రాఫ్ట్స్, జాగ్రఫీ, హాబీ అంటూ ఎవరన్నా చెప్తుంటే నాకు మట్టుకు చెడ్డ తలనొప్పి వేస్తుంది సుమండీ" అని హఠాత్తుగా అతి మందహాసం చేసింది కమల తన తప్పు గ్రహించి. ఆ మందహాసమే లేకపోతే పేలవమైన తన జాతికి సహజమైన తుదిమాటలు నాకు యింతగా రుచించేవికావు. అంతేకాక "ఎవరన్నా భాషిస్తే ..నాకు మట్టుకు..." అని కమలచేసిన పొరపాటు ఆమె ఎంతో నేర్పుతో తన మందహాసమనే అవనిక వాల్చి దాచుకున్నది. ఆడవాళ్ళ నవ్వుకు యిన్ని బహుళ ప్రయోజనాలు వుంటవి గావల్ను. కమల చెప్పుకుపోతూంది.

"అంతకన్నా వారి కెరియర్‌కు దారితీసే విద్యను స్వచ్ఛందంగా నేర్చుకునే హక్కును విద్యార్థులకు ఏదో ఒక స్టేజిలోయిస్తే ఎంత బావుండును" అంటూ కమల ఏదో జ్ఞప్తికి వచ్చినట్లు నావంక చూసింది. యూనివర్సిటీ పరీక్షల్లో తృతీయుడిగా నిలబడికూడా బి. యి. సీటు దొరకని నా చరిత్ర కమలకి గుర్తు వచ్చివుంటుంది.

అనుకుంటూనే పప్పులో కాలు వేశాను. ఇంతసేపటినుంచి ఎంతో కృతకంగా దాచిన నా విచారం హఠాత్తుగా విజృంభించటంలో నోరుజారి అన్నాను.

"మన పెళ్ళినాటి సంగతులు జ్ఞప్తికి వచ్చాయా పిచ్చిపిల్లా."

కమల వాస్తవంగా తనతప్పు గ్రహించింది. ఆమె మనస్సు ఎంతో నొచ్చుకొని వుంటుందనటానికి - ఎప్పుడూ నాజీవితానికి ఆశనుచూపే ఆమె వదనం పొందిన వైవర్ణ్యమే సాక్షి.

ఆమె మరి మాట్లాడలేదు! ఇక కమలని మాట్లాడించటం నాసాధ్యంగానిపని. ఆమె వల్ల యింకా ఎన్నో విషయాలు తెలుసుకోవాలని ఆశతోవున్నా, నా వుత్సాహం తగ్గిపోయింది ఆమెవంక చూడగానే.

"ఈవిధంగా మధ్యతరగతి కుటుంబాల రక్షణకోసం నీలాంటి చదువుకున్న స్త్రీలు వుద్యోగాలు చేస్తే తప్పేమి!" అని సందర్భోచితంగా ప్రశ్న వేశాను.

"ఇహ చాలెద్దురూ బాబూ మీ యక్షప్రశ్నలూ మీరూనూ - నాకు నిద్దరవస్తోంది" అంటూనే లేచి వెళ్లిపోయింది కమల ఆవులిస్తూ.

ఉదయం జరిగిన విషయంతో ఆరాత్రి నాకు న్యాయంగా నిద్దరపట్టగూడదు.

కాని-అధరోష్ఠంమీద. దాగిన చిరునవ్వు



## మన విద్యావిధానమూ - మా అవిధ వుపన్యాసము



తాలూకు వో అరవంపు నిద్రలో తోపించే అమాయకత్వానికి ఒకహద్దు ఏర్పరచి వదన సీమ తో గంభీరముద్రని ప్రసాదింపగా - గతాన్నీ భవిష్యత్తునూ నిర్లక్ష్యంచేస్తి సాగి పోయే అమరతటిలా - తన గమన వేగాన్నీ గభీరతనీ ప్రదర్శించికూడా ప్రదర్శించనట్లు ప్రశాంతంగా నిశాభామిని వడిలో పవళించి తన జీవితపు భానూదయానికై వికసించ టానికి సిద్ధంగావున్న కమల ముకుళిత ముఖ కమలాన్ని చూసికూడా నామనస్సులో తీరని బాధల వేదనల ననుభవిస్తూ ఎలా వుండగలను?






# ప్రశ్నలు

జి. మల్లికార్జునరావు

తెలియజేయగదమ్మ నాకిది
తేటతెల్లముగాను వివరము.

చుక్కలన్నిటి నాకసంబున
చక్కగా వరుసలుగ దీరిచి
ముదముమీరగ ముగ్గులేసిన
ముదితలెవ్వరో తెల్పవమ్మా!

తెల్లవారకమున్నె జగమున
నెల్లపూలకు రంగులేసిన
ఇంద్రజాలము నేర్చినట్టి మ
హేంద్రజాలికు డెవ్వడమ్మా!

నెమలికెవ్వరు నాట్యభంగిమ
నేర్పినారో చెప్పవమ్మా?
కోకిలమ్మకు రాగశైలిని
కోరినేర్పిన దెవ్వరమ్మా?

రాత్రులందున దేశమ్మంతట
క్రమ్ముకొనునే చిమ్మచీకటి!
ముసరుకొను యీ కారునలుపును
విసరిపోయిన దెవ్వరమ్మా?

తెలియజేయగదమ్మ నాకిది
తేటతెల్లముగాను వివరము.




డోవరులో ఉన్న "ఫిషర్‌మన్స్ రెస్ట్" హోటలు చాలా ప్రాచీనమైనది - ప్రసిద్ధమైనది. ఈ హోటలు యజమాని జెల్లీబాండ్ చెప్పుకోదగిన మనిషి. అంత మంచి మర్యాద, నమ్రత కలవాడు మరొకడు లేడు. వచ్చే పోయే వారితో హోటలు ఎప్పుడూ సందడిగానే ఉంటుంది. నగడులోని చలిమంట తీయకుండా ఎప్పుడూ జాజ్వల్యమానంగా మండుతుంటుంది. దానికి దగ్గరగా నిలబడి, పైప్ కాలుస్తుంటూ, అతిథులకు ఏ లోటు రాకుండా వెయ్యి కళ్లతో గమనిస్తుంటాడు జెల్లీ. అతని తండ్రి తాత, ముత్తాతకూడా అలాగే చేసేవారు. వారికీ, వారు నడిపిన ఆ హోటలు పేరుకీ లోటు రాకుండా, జెల్లీ వారి పద్ధతినే అనుసరించి హోటల్ నిర్వహిస్తున్నాడు. జెల్లీబాండ్ కూతురు శాలీ ఉన్న రెండు చేతులతోనే లేని మరో నాలుగు చేతుల పని కూడా చేస్తుంటుంది. అతిథులు అడగటం తడవుగా పానీయాలు తెచ్చి అందిస్తుంటుంది. ఆ పానీయాలు సేవిస్తూ, అతిథులు ఉత్సాహభరితులౌతుంటే మన హోటలు యజమాని వారితో దేశ విదేశ రాజకీయాలుగురించి చర్చిస్తూ ఉంటాడు.

1792 వ సంవత్సరం - సెప్టెంబరు నెల దాదాపుగా గడిచిపోయింది. అప్పటిదాకా వెచ్చగా, హాయిగా ఉన్న వాతావరణం ఒక్కసారి మారిపోయింది. రెండు రోజులనుండి జోరున ఒకటే [illegible]లు ఒరుసుకొనిపోతూ చలి. ఫిషర్‌మన్స్ రెస్ట్ అల్పాహార శాలలో మామూలుగానే పానీయాలు సరఫరా అవుతున్నాయి. నెగడు మండుతున్నది. అతిథులు వెచ్చగా కూర్చొని కులాసా కబుర్లు చెప్పుకుంటున్నారు. ఉండుండి ఈ మూలనుండి ఒకసారి, ఆ మూలనుండి ఒకసారి పైకప్పు లేచిపోయేటట్లు, బయటి ఈదురుగాలి హోరు మునిగిపోయేటట్లు అతిథుల నవ్వులు ప్రతిధ్వనిస్తున్నాయి. అల్పాహారశాల అంతటా వెలుగుతున్న కొవ్వొత్తుల కాంతిలో, నెగడులోని చలిమంట వెలుగులో అక్కడ కూర్చున్న వారి ముఖాలు మసక మసకగా ఎర్రటి చీకటిలో ఉన్నట్లు కనిపిస్తున్నాయి.

ఈ కూర్చున్నవారిలో ఇద్దరు మాత్రమే విదేశీయులు ఉన్నారు. వారిద్దరూ ఫ్రెంచి వారే. వారు తక్కిన వారితో ఏమీ ప్రసక్తి లేకుండా, చదరంగం ఆడుకుంటూ ఒకమూల కూర్చున్నారు.

పారిస్‌లో స్వాతంత్ర్యం సాధించటంకోసం విప్లవసంఘంవారు కొనసాగిస్తున్న హత్యాకాండ గురించిన వార్తలు తక్కిన దేశాలకు చేరుతున్నట్లే, ఇంగ్లాండుకూ చేరుతున్నాయి. ఉభయ దేశాల మధ్య దొంగసరుకుల రవాణా చేసే వ్యాపారులవలన ముఖ్యంగా ఈ వార్తలు ఇంగ్లాండు చేరుతున్నాయి. ఈ వార్తల మూలాన ఫ్రెంచి దేశమన్నా, ఫ్రెంచివారన్నా ఇంగ్లాండు ప్రజలకు సదభిప్రాయం లేకుండా పోయింది. అయితే ఉభయ ప్రభుత్వాలకు ఉన్న

రాయబారసంబంధాలు బాహాటంగా తెగి పోనందున ఇంగ్లాండులో ఫ్రెంచి వారిని భరించటం తప్పనిసరి అవుతున్నది. అందుచేతనే జెల్లీ ఇష్టంలేక పోయినా, తన హోటలుకు ఇద్దరు ఫ్రెంచివారిని రానిచ్చి, వారి సంగతి కూడా విచారించవలసి వచ్చింది.

పని ముగించి కాస్త స్థిమితంగా నిలబడ్డది శాలీ. పని లేనప్పుడు అతిథులకు ఎదురుగా కూతురు నిలబడటం ఇష్టం లేదు జెల్లీకి "అమ్మాయి! అలా నిలుచుంటే ఎలా ? వంటగదిలోకి పోయి లార్డ్ ఆంటో నికి వారికి భోజనపు ఏర్పాట్లు చూడు. నీవు కొంచెం దగ్గర ఉండి చూడకపోతే పదార్థాలేమీ బాగుం డవు" అన్నాడు. శాలీ అయిష్టంగా లోపలికి వెళ్లి పోయింది.

"పెద్ద పెద్దవాళ్లెవరయినా వస్తున్నారా ఏమిటి ఇవ్వాళ?" అని అడిగాడు ఎదురుగా ఉన్న ఒకడు

"మరేమిటి? లార్డ్ ఆంటోనీ ఉన్నారే! ఆయన తాలూకూ పెద్ద కుటుంబంవారు ఎవరో వస్తు న్నారు - పారిస్‌నుంచి. ఆయన స్నేహితుడు, సర్ ఆండ్రూ కూడా వారివెంట వస్తున్నారు"

శాలీ ఆదుర్దాగా తండ్రిదగ్గరకు పరుగెత్తు కొని వచ్చింది "నాన్నా లార్డ్ ఆంటోనీ!" అంటూ తలుపు దగ్గరకు ఎదురు పరుగెత్తుకొని వెళ్లింది తలుపు తెరుచుకొని లార్డ్ ఆంటోనీ లోపలికి ప్రవేశించాడు. నీళ్ళు కారుతున్న పై కోటు విప్పేసి, ఒక పరిచార కుడి చేతి కిచ్చాడు. జెల్లి సంభ్రమంతో ఎదురు వెళ్ళి "దయచెయ్యండి, దయచెయ్యండి" అంటూ స్వాగతం చెప్పాడు.

లార్డ్ ఆంటోని డ్యూహార్స్ట్ తండ్రి ఎక్సెటర్ ప్రభువు ఆనాటి ధనిక ఉన్నత వంశీకులలో బాగా పలుకుబడి, మాటఘన్నన కలవాడు ఆంటోని. పెదవులమీద ఎప్పుడూ చిరునవ్వు మెరుస్తుం టుంది. ఆ చిరునవ్వుతో ఎవరినైనా యిట్టే ఆకర్షిం చగలడు. లార్డ్ ఆంటోని ఫిషర్‌మన్స్ రెస్ట్‌కు అడప తడపా వస్తూ పోతూ ఉంటాడు అందుచేతనే జెల్లీ ఆయన గురించి ప్రత్యేక శ్రద్ధ ప్రదర్శించటం.

లోపలికి వస్తూనే ఆంటోని పరిచితుల నంద రినీ వరుసగా పలకరించాడు చివరకు జెల్లిని సమీ పించి అడిగాడు "భోజనం తయారైందా? మావాళ్లు



1. వెక్కిముఖం వేసుకొని చూస్తున్న జెల్లీని మృదువుగా చేతితో నెట్టివేస్తూ, తలుపుతీసుకొని మార్గరెట్ లోపలికి వచ్చింది

వచ్చేవేళ అయింది పాపం! ఆకలితో నకనక లాడుతూ, చాలా అలిసిపోయి వస్తారనుకుంటాను"

అంతా సిద్ధంగానే ఉన్నదని శాలీ బదులు చెప్పింది ఇంతలో హోటలు బయట గుఱ్ఱాల గిట్టల చప్పుడు వినిపించింది. పెద్దరకం కోచిబండి చక్రాలు రాతినేల నొరుసుకొనివచ్చి ఆగినట్లు వినిపించింది "అరుగో! వచ్చినట్లున్నారు మిలార్డ్!" అన్నది శాలి ఆ వచ్చేవారు ఎవరో ఎలా ఉంటారో అనే కుతూహలంతో అల్పాహారశాలలో ఈ ప్రక్కనుండి ఆ ప్రక్కదాకా సంచలనం కలి గింది. ఆ చదరంగం ఆడుకుంటున్న విదేశీయులు మాత్రమే ఇవతల జరుగుతున్న దేమీ పట్టించుకో కుండా ఆట కొనసాగిస్తున్నారు.

వచ్చినవారికి స్వాగతమివ్వటానికి జెల్లీ హడావిడిగా ద్వారం వద్దకి వెళ్లాడు. "శాలీ! ఆల స్యం చెయ్యకు! పోయి భోజనాల ఏర్పాటు చూడు. ఈలోగా కాస్త తాగేటందు కేమయినా తీసుకురా! తొందరగా!" అంటూ తరిమాడు లార్డ్ ఆంటోని. బయట "ఇలా దయచెయ్యండి ఇటు" అని సర్ ఆండ్రూ కంఠం వినిపించింది. ఏదో పెద్ద బరువు తొలగి పోయినట్టు నిట్టూర్చాడు ఆంటోనీ.

"ఏమని పాడితివో!" (బసవరాజు అప్పారావు)
బాల చిత్రకారిణి: కుమారి ముక్కపాటి లలితాదేవి.

#  స్కార్లెట్ పింపర్నల్ 

జెల్లీ నమ్రతగావంగి, చేతులు జాపుతూ "దయ చెయ్యండి! ఇలాఇలా" అంటూమర్యాద చేస్తూఉండగా ముందుకౌంటెస్‌డి, టూర్నే వెనుక ఆమె కుమార్తె సుజేన్ ఆవెనుక ఆమె కుమారుడు వైకౌంట్ డిటూర్నే ఆవెనుక సర్ ఆండ్రూ లోపలికి ప్రవేశించారు. లార్డ్ ఆంటోనీ వారిని చిరునవ్వుతో ఎదుర్కొని స్వాగతం చెప్పాడు.

కౌంటెస్ ఒకనిమిషం లార్డ్ ఆంటోనీని పరిశీలించి కొంచెం యాసతో "మీరు లార్డ్ ఆంటోనీ కాదూ!" అని అడిగింది. లార్డ్ ఆంటోని అవునన్నట్లు తల ఊపి" ప్రయాణం ఏమీ యిబ్బంది లేకుండా గడిచింది దాక!" అని ప్రశ్నించాడు. కౌంటెస్ తొట్రుపాటుతో "ఆ! ఆ! ఎలాగో మీ యింగ్లాండు చేరుకున్నాం. మాకెంతో సంతోషంగా ఉన్నది. మేము ఇదివరకుపడిన ఇబ్బందులన్నీ మరిచి పోయినాము." అని బదులు చెప్పింది.

"మా సర్ ఆంద్రూ మీకు అన్ని సౌక ర్యాలు కలిగించా డనుకుంటాను."

ఈ మాటలు విని సుజేన్ కళ్లు కృతజ్ఞతతో మెరిసిపోయినాయి. ఒక్కసారి ఆంద్రూ ముఖం వంకచూసి, అతడు తన వంకే చూడటం గమనించి సిగ్గుతో తల వంచుకున్నది. కౌంటెస్ అన్నది.

"మీరు, మీ మిత్రుడు మాకోసం పడిన శ్రమ మరిచిపోగలమా? ఏమి చేస్తే మాత్రం, ప్రాణదాతలయిన మీ ఋణం తీర్చుకోగలమా?"

ఇలా కుశలప్రశ్నలు జరుగుతుండగా నే అక్కడ చేరినవారందరూ దాదాపుగా వెళ్లిపోయి నారు. చదరంగం ఆడుకుంటున్న ఆ విదేశీయులు మాత్రమే ఆట కొనసాగిస్తున్నారు.

అందరూ అక్కడే కూర్చొని భోజనాలకు ఉపక్రమించారు. అందరి ముఖాలు ఆనందంతో కళ కళ లాడుతున్నాయి.

"అయితే ఇదే నన్నమాట ఇంగ్లాండు." అన్నది సుజేన్ చుట్టూ చూస్తూ. ఆంద్రూ చిరు నవ్వు నవ్వుతూ "ఇదే ఇంగ్లాండు కాదు. అందులో ఒక రవ్వంతభాగం. అయితే నేమి? ఇంగ్లాండులో ఎక్కడికి పోయినా మీ కిక్కడ ఇచ్చినట్లే ఘన స్వాగత మిస్తారు." అన్నాడు.

ఫ్రెంచివారి చదరంగం ఆటముగిసింది. అందులో ఒకడులేచి కోటుసర్దుకుంటూ ఇవతల భోజనాలుకాని స్తున్న వారివంక చూశాడు. ఎవ్వరూ తమను గమనిం చటంలేదు. అతడు తన మిత్రునివంక తిరిగి ధైర్యంగా "ఫరవాలేదులేకానీ! వారు చూడటంలేదు." అన్నాడు. మరుక్షణంలో రెండవవాడు బల్లిలాగా నేలకుకరుచుని, సవ్వడికాకుండా అక్కడ బల్లలక్రిందికి పాకిపోయి, క్రీనీడలోకూర్చున్నాడు. మొదటివాడు ద్వారంవద్దకు వెళ్ళి 'వెళ్ళివస్తాము' అని బిగ్గరగాచెప్పి శలవుతీసుకొని బయటికి వెళ్ళిపోయినాడు.

అతడువెళ్ళిపోగానే ఆంటోనీ ఒకసారి కలయ చూశాడు. "అమ్మయ్య? ఇప్పటికి అంతా వెళ్ళిపోయి నారు. ఇకమనం స్వేచ్ఛగా మాట్లాడుకోవచ్చు"అంటూ కౌంటెస్ వైపు తిరిగి ఆంటోనీ ఇలా అన్నాడు. "మీరు సురక్షితంగా ఇంగ్లాండుచేరారు. ఇక కౌంట్ డి టూర్నే రావలసిఉన్నది. ఆయనకు స్వాగతం ఇవ్వటానికి ఇక మేము తయారుకావాలన్న మాట."

కౌంటెస్ముఖం వివర్ణమైంది - కన్నులనుండి అశ్రువులు బొటబొటకారినాయి. "నాకు ఇప్పుడని పిస్తున్నది నేను పొరపాటుచేశానని. ఆయనను విడిచి పెట్టి రావలసిందికాదు నేను. కాని యీపిల్లల మూలాన తప్పలేదు. నేను బయలుదేరకపోతే తామూ బయలు దేరమన్నారు."

"మీరేమీ భయంపెట్టుకోవద్దు. మిమ్మల్ని సుర క్షితంగా చేర్చామా లేదా? అలాగే ఆయననూ చేరు స్తాం. కాకపోతే ఒకటిరెండురోజులు ముందూవెనకా. అంతే; మామీద ఆ మాత్రం నమ్మకం ఉంచలేరా?" అని ఓదార్చాడు సర్ ఆంద్రూ.

"మీరు చేర్చలేరని కాదు. నా ఆదుర్దా అటు వంటిది. నే నిక్కడ హాయిగా నిశ్చింతగా కూర్చొని కడుపునిండుగా మెక్కుతున్నాను. అక్కడ ఆయన ఎలా ఉన్నారో, ఎంత కష్టపడుతున్నారో కదా!"

సుజేన్, వైకౌంటు దిగాలపడి కూర్చున్నారు. సుజేన్ వణికిపోతున్న కంఠాన్ని ఎలాగో నిలుపు కొని సర్ ఆంద్రూతో అన్నది. "మా నాన్నగారికి మరేం ఫరవాలేదని మీరు ధైర్యం చెప్పారు. మీరు అన్నంతా చేసి తీరుతారని నాకు తెలుసు. మరి మా నాన్నగారిని ఎప్పుడు తీసుకువస్తారో చెప్పండి."

సర్ ఆంద్రూ బలంగా నిట్టూర్చాడు. "ఎప్పుడు తీసుకు వచ్చేది నేను ఎలా చెప్పగలను? సురక్షితంగా ఇక్కడికి చేర్చే మాటమాత్రం ఖాయం. కాని ఎన్నాళ్ళు పడుతుందో ఏమో! ఇదంతా నా యిష్ట ప్రకారం చేసేది కాదు. మాకు ఒక నాయకుడు ఉన్నాడు. ఆ య న ఆజ్ఞకు మేమంతా బద్ధులమై ఉండాలి. ఆయన ఎప్పుడం టారో మరి?"

కౌంటెస్కు కుతూహలం హెచ్చింది. "అవును కదూ! అన్నట్లు ఆమాటే మరిచి పోయాను. మీ నాయకుడు - ఆ మహానుభావుడు ఎక్కడ ఉన్నారు? చెప్పండి. నేనూ నా బిడ్డలమూ ఆయన పాదాలమీద బడి ప్రణామం చెయ్యాలి."

ఆంటోనీ అందుకొని ఇలా అన్నాడు.

"మీరు మా నాయకుణ్ణి చూడటానికి వీలు పడదే!"

 

# స్కార్లెట్ పింపర్నల్



"ఎందుచేత?"

"స్కార్లెట్ పింపర్నల్ అజ్ఞాత వ్యక్తి. ఆ రహస్యాన్ని ప్రాణాధికంగా కాపాడుతామని ప్రతిజ్ఞ చేసిన ఆయన అనుచరులకు తప్ప మరెవ్వరికీ ఆయన ఎవరో తెలియదు."

"స్కార్లెట్ పింపర్నల్! భలే తమాషాగా ఉన్నదే యీ పేరు?" అని పకపకలాడింది సుజేన్. "స్కార్లెట్ పింపర్నల్ అంటే అర్థం ఏమిటండీ?"

సుజేన్ అడగటం సర్ ఆండ్రూనే అడిగింది. సర్ ఆండ్రూ బదులు చెప్పాడు.

"ఇన్నాళ్లూ స్కార్లెట్ పింపర్నల్ అంటే డొంకలవెంట, కంచెలవెంట విరగబడి పూచే ఒక పువ్వని మాత్రమే. ఇప్పుడో ప్రపంచంలోకెల్లా అత్యుత్తముడైన, అతి ధైర్యవంతుడైన ఒక అజ్ఞాత సాహసికుడని దాని అర్థం." ఈ మాటలు చెప్పున్నప్పుడు సర్ ఆండ్రూ కళ్ళు తమ నాయకునిపట్ల ఆయనకు గల గౌరవాభిమాన ప్రేమలతో మిలమిల మెరిసిపోయినాయి.

కౌంటెస్ ఆశ్చర్యంతో ఇలా ప్రశ్నించింది. "ఒక్కమాట చెప్పండి. తెలియక అడుగుతున్నాను. మీరూ మీ నాయకుడు ఇంత వ్యయప్రయాసలకోర్చి, ప్రాణాలకు తెగించి, మమ్మల్ని రక్షించటం దేనికి? మా మీద ఈ ప్రత్యేకాభిమానం ఎందుకు?"

"సరదా! కేవలం సరదా!" అన్నాడు లార్డ్ ఆంటోనీ. "మనిషికొకరకం సరదా ఉంటుంది. పాము నోట్లో ఉన్న కప్పను బయటికి లాక్కురావటం మాకు సరదా! అలా చేస్తుంటే ఎంత హుషారుగా ఉంటుందని? వెంట్రుకవాసిలో ప్రతిసారి పీకలమీదికి కత్తివస్తుంటే, ఆ ఆపదలన్నీ గడిచి బయటపడుతుంటే...! ఓహ్!"

సుజేన్ ఇదంతా వింటూ మైమరచిపోతున్నది. "మొత్తం మీరంతా ఎంతమందో అదయినా చెప్పవచ్చునా?"

"ఓ! దానికేం. ఇరవైమందిమి. అంటే మా నాయకుడు కాక పందొమ్మిదిమందిమి. ఆయన ఆజ్ఞానుసారం నిప్పులో దూకమన్నా - సముద్రంలోకి ఉరకమన్నా సంసిద్ధంగా ఉన్నాము."

కౌంటెస్ హృదయం కృతజ్ఞతతో, వారిపై గౌరవంతో నిండిపోయింది. ఆమె కన్నులనుండి ఆనంద బాష్పాలు రాలినాయి. "మీరు ఇది సరదాకోసం చేస్తున్నామంటున్నారు కాని, నాకు అలా అనిపించటం లేదు. ఏదో ఉదాత్తమైన ఆశయంతో ఈ మహాత్కార్యం మీరు చేస్తున్నారు. ఆ భగవంతుడు మిమ్మల్ని సర్వదా కాపాడాలి." అన్నది ఆమె చేతులుజోడిస్తూ

"ఇంతవరకూ భగవంతుడు మా పక్షానే ఉన్నాడు."

"ఇంతవరకే నన్న మాటేమిటి? ఇకముందు కూడా మీ పక్షానే ఉంటాడు. మీరు చేస్తున్నది ధర్మమైన పని. మా దేశం ఎలా అయిపోయింది? పరిస్థితులు ఎంతదుర్భరమై పోయినాయని! చివరికి స్త్రీలుకూడా సహజమైన కరుణాలాలిత్యం కోల్పోయినారు. బహుశా మీరు వినేఉంటారు. మార్గరెట్ సెంట్ జస్ట్ అనే ఆవిడ మార్క్విస్ డి సెంట్ కర్ ను సకుటుంబంగా గిలటైన్‌కు పంపించింది."

ఆంటోని ఆమాట విని అదిరి పడ్డాడు. "ఎవరు? మార్గరెట్!"

"అవును. ఈ మధ్యనే ఆవిడ ఎవరినో మీ యింగ్లీషుఆయననే పెళ్ళి చేసుకున్నది కూడా! మీరు ఎరగరేమిటి ఆవిడను?"

"ఎరగకపోవటమా! ఆవిడ నెరగనివారెవరు? లండన్ మహిళాసంఘంలోకెల్లా నాజూకైన ఫాషన్‌రాణి - ఇంగ్లాండులోకెల్లా అత్యధిక ధనవంతుడయిన పెర్సీ బ్లాకనీ సతీమణి - ఆమె తెలియకేం! మార్గరెట్ బ్లాకనీ."

"మార్గరెట్, నేను చిన్నప్పుడు కలిసి చదువుకున్నాము." అన్నది సుజేన్. "ఆమె ఎంతో మంచిదమ్మా! ఇటువంటి కిరాతకపు పని ఆమె చేసిందంటే నమ్మటానికి వీలు లేకుండా ఉన్నది."

"నీకు తెలియదు. ఊరుకో సుజేన్!" అని కసిరింది కౌంటెస్. మార్గరెట్ అంటే ఆమెకు ఎంత అసహ్యమో స్పష్టంగా తెలిసి పోతున్నది. ఆమె లార్డ్ ఆంటోనీ, సర్ ఆండ్రూలవంక తిరిగి ఇలా అన్నది. "అయితే మార్గరెట్ బ్లాకనీకి ఇక్కడ బాగా పేరు ప్రసిద్ధి ఉన్నాయన్నమాట! ఆవిడ ఏమయితే ఎవరికి కావాలిగాని, మేము ఇక్కడ ఇంగ్లాండులో ఉన్నన్నాళ్ళు ఆవిడను మేముగాని, మమ్మల్ని

ఆవిడగాని కలుసుకోవలసిన పరిస్థితి తీర్పడకుండా ఉంటే చాలు."

ఈ సంభాషణతో అందరికీ నిరుత్సాహం కలిగింది. సర్ ఆంథ్రూ ఏమీ తోచక చేతిలోని ఫోర్కు తిప్పుతూ గిన్నెంతా వెదుకుతున్నాడు. అంతలో తల వంచి ఒకటి రెండు సార్లు "ఎలా ఇచ్చాడు?" అన్నట్లు జెర్లీ వంక చూశాడు. జెర్లీ అంతకన్నా గాభరాపడి నోరు తెరుచుకొని, నోట్లోనుండి పొగ

వస్తూ ఉండగా అలాగే నిలబడి పోయినాడు. కౌంటెస్ ఏదో తీవ్రంగా యోజిస్తూ కుర్చీలో ఠీవిగా వెనుకకు ఆనుకొని కూర్చున్నది. సుజేన్, వైకౌంట్ ఒకరివంక ఒకరు తెల్లబోయి చూస్తున్నారు. కొన్ని క్షణాలపాటు అంతా అయోమయమైంది.

అందరికంటె ముందు లార్డ్ ఆంటోని కొంత స్థిమితపడి, జెల్లీని రహస్యంగా అడిగాడు. "సర్ పెర్సీబ్లాకెనీ, మార్గరెట్ బ్లాకెనీ ఇక్కడికి ఎప్పుడు వస్తున్నారన్నావు?" జెల్లీ పెదవులు వణికి పోతున్నాయి. నీరసంగా "ఏమో ప్రభూ! ఎప్పుడయినా రావచ్చు. ఈ నిమిషాన వచ్చినా రావచ్చు." అన్నాడు.

జెల్లీ సమాధానం ఇంకా పూర్తికానేలేదు. హోటలుముందు కంకరబాటమీద గుర్రపు డెక్కల చప్పుడు వినిపించింది. ఆ చప్పుడు క్రమంగా దగ్గరకు వచ్చి పెద్దదై నిలిచిపోయింది. నాలుగు ఉత్తమాశ్వాలు లాగుతున్న ఒక కోచి హోటలుముందు ఆగింది. అక్కడ ఉండే పరిచారకుడు వినయ విధేయతలతో కోచి తలుపు తెరిచి, ఒత్తిగిలి నిలబడి, యజమానికి హెచ్చరికగా బిగ్గరగా ప్రకటించాడు.

"సర్ పెర్సీబ్లాకెని, లేడీ మార్గరెట్ బ్లాకెనీ విచ్చేశారు!"

ఈ ప్రకటన వినగానే ఆంటోనీ అదిరిపడి లేచాడు. అడ్డంవచ్చిన కుర్చీలు బల్లలు తోసి వేస్తూ, కనకంటె గాభరాపడుతున్న జెల్లీని పట్టుకొని, "అలా చేస్తే బాగుంటుంది. వద్దు వద్దు ఇలా చెయ్యి" అని హుకుములు జారీ చేస్తూ మరింత గాభరా పెట్టాడు. జెల్లీకయితే దీనితో మతి పోయినట్లయింది.

"నీకు పుణ్యముంటుంది జెల్లీ! నీవు ముందు పరుగెత్తుకొని పోయి, ఆ మార్గరెట్ బ్లాకెనీ లోపలికి రాకుండా చూడు. ఈలోగా నేను వీరిని లోపలికి పంపించేస్తాను." అని జెల్లీని పంపించాడు అంటోనీ. "ధూత్! ఏం కర్మ వచ్చిపడింది?" అని విసుక్కున్నాడు.

"శాలీ! కాస్త దీపం తెద్దూ! దీపమే శాలీ!" అంటూ జెల్లీ ఖంగారుగా ఇటూ అటూ గంతులు వేసి పరుగెత్తటం ప్రారంభించాడు. అందరికి అడ్డం పడి నానా హంగామా చేశాడు. కౌంటెస్ ఉద్రేకంతో లేచి, నిటారుగా నిలబడి," ఆవిడ మొహం చూడటం నాకు ఇష్టంలేదు. నే నావిడ మొహం చూడను. చెపుతున్నా." అని బెదిరించటం మొదలుపెట్టింది.

క్రొత్తగా వచ్చిన అతిథులకు బయట వరండాలో ఒక రొక్కరే నమస్కారాలు పెడుతున్నారు. ఎవడో బిచ్చగాడు. "అమ్మా! బాబూ! కళ్ళులేని కబోదిని. ధర్మం చెయ్యండమ్మా! పుణ్యముంటుంది. కనికరించండి." అని బతిమిలాడుతున్నాడు. కమ్మటి కోయిలకంఠస్వరంతో ఆ బండిదిగిన ఆమె "ఏయి! ఎవరక్కడ ఆ గుడ్డివాడికి కడుపునిండా తిండి పెట్టించండి." అనటం లోపలివారికి వినిపించింది. ఒక నిముషంసేపు అందరూ ఆ మాటలు వింటూ నిలబడి పోయినారు.

శాలీ దీపం తెచ్చి, అల్పాహారశాలనుండి విశ్రాంతిగదులలోకి పోయే వాకిలివద్ద నిలబడింది. తాను మొహం చూడ కూడదనుకున్న శత్రువు లోపలికి రాకముందే, అక్కడినుండి వెళ్ళిపోవటానికి కౌంటెస్ సిద్ధం అవుతున్నది. సుజేన్‌కు మార్గరెట్‌ను చూడకుండా వెళ్ళిపోవటం యిష్టంలేదు. అందుచేత తిరిగివెనక్కి తలుపువంకచూస్తూ, తప్పనిసరి అయి తల్లి వెంటబయలుదేరింది.

బయట మార్గరెట్ మాటలు వినిపిస్తున్నాయి. "అబ్బబ్బ! ఏం వర్షం? ఏమి చలి? ఇలాంటి ముసురు ఎప్పుడూ పట్టలేదు."

వాకిలివంక చూస్తూ నిలబడిన సుజేన్‌ని కౌంటెస్ తీవ్రంగా అదిలించింది. "ఏయి? సుజే! నీకే చెప్పేది. దిక్కులు చూడక నాతో రా!"

బయట మార్గరెట్ అధికారస్వరంతో జెల్లీని మందలిస్తున్నది.

"ఏమయ్యా జెల్లీ జాండ్! ఒకచెంప నేను ముద్దల్లే తడిసి, చలికి వణికిపోతుంటే, ఎందుకలా దారికి అడ్డంగా నిలబడి, నిప్పులు తొక్కిన కోతిలాగా గంతులు వేస్తున్నావు? లోపలికి రానిస్తావా? లేదా?"

ఏమి చెయ్యాలో, ఏమి సమాధానం చెప్పాలో తోచక

వెర్రిముఖం వేసుకొని చూస్తున్న జెల్లీని మృదువుగా చేతితో నెట్టివేస్తూ, తలుపు తీసుకొని మార్గరెట్ లోపలికి వచ్చింది.

(ఇంకా వుంది)

వేణూ, కృష్ణ ఇద్దరూ కలిసి ఒకసారి సైకిళ్ళమీాద బయలుదేరారు. వారు 20 మైళ్ళదూరంలో ఉన్న ఒక గ్రామం పోవలసిఉంది. నాలుగుమైళ్లు వెళ్లేసరికి వేణు సైకిల్ ఛెయిను తెగిపోయింది.

ఇద్దరూ ఆ గ్రామం ఒకేసారి చేరుకోవాలి. ఒక సైకిలుమీాదే ఇద్దరు ఎక్కకూడదు. నడిచిపోతే గంటకి నాలుగుమైళ్ళు నడవగలరు. సైకిలుమీాదయితే గంటకి ఎనిమిదిమైళ్ళుపోగలరు.

"ఏమిచేయాలా?" అని ఇద్దరూ కొంచెంసేపు ఆలోచించారు. మెరుపల్లే ఒక ఆలోచనతట్టింది కృష్ణకు. చెడిపోయిన వేణుసైకిల్ అక్కడ విడిచిపెట్టి రెండవ సైకిల్ సహాయంతో ఇద్దరూ ఒకేవేళకి ఆ గ్రామం చేరుకున్నారు.

ఎలా చేరుకోగలిగారో మీారు చెప్పగలరా? కొంచెం ఓపికపట్టండి. వచ్చేవారం వేణు, కృష్ణుల ఆలోచించండిచూద్దాం. మీారుకనక చెప్పలేకపోతే చేతనే చెప్పిద్దాం.

---

ఏమిటి? నేను ఏమిచేసి ఉంటానో మీకు తెలియ లేదూ? అబ్బే! మీరు సరిగా శ్రద్ధగా ఆలోచించి ఉండరు. ఆలోచిస్తే మీకూ తెలిసేదే! ఏముంది? అంతకన్న సులువైంది మరొకటిలేదు. అక్కడ నాలుగుదారు లున్నాయికదా! అందులో ఒకదారివెంబడినేను వచ్చాను. నేను ఏ ఊరినుంచి వచ్చానో, ఆ ఊరిపేరు నాకు తెలుసయ్యేను. ఆ సైన్‌పోస్ట మీద నాలుగుదారుల వెంబడి పోతే ఏఏ ఊళ్ళు వస్తాయో రాసిపెట్టిఉన్నది - అందులో నేనువచ్చిన ఊరు పేరున్న చెక్క, నేనువచ్చిన దారి వైపుకు తిప్పిపెట్టితే - తక్కిన మూడుదారులు ఏఏ ఊరు వెళ్తాయో సులభంగా తెలిసిపోతుందికదా! ఇంతే! నేను అలాగేచేశాను ఘూంమని వెళ్ల వలసిన చోటికి వెళ్లిపోయినాను. తెలిసిందా!

# అల్లరి పిల్లలు



## 2. పాములు-నిచ్చెనలు.

ఒకపెద్ద కాగితపుపటంమీద చాలా బొమ్మలున్న గళ్లు ఉంటాయి. గవ్వలతో పందెంవేసి పావుని గడిలో నడిపిస్తూంటారు. పటంలో అక్కడక్కడ నిచ్చెనలు, పాములూ ఉంటాయి. నిచ్చెనకింది వరసలో ఒకగడిలోనించి పైవరసలో ఎక్కడో ఇంకోగడిలోకి ఉంటుంది. పావుగనక నిచ్చెనఅడుగు మెట్టు ఉన్న గదిలోకి వస్తే, ఆనిచ్చెన ఎక్కి పైగడిలోకి వెళ్ళిపోవచ్చును. ఇక పాములున్నాయి. పావుగనక పాముతలఉన్న గడిలోకి వస్తే అక్కడినుంచి మళ్ళీ వెనక్కి పాముతోక ఎక్కడఉన్నదో అక్కడికి వచ్చేస్తుందన్న మాట. ఈ పాములు, నిచ్చెనలుకూడా పెద్ద పెద్దవీ ఉంటాయి, చిన్న చిన్నవీ

చిన్నపిల్లలలో ఉండే తమాషా ఏమిటంటే ఆడుకున్నంత సేపూ ఆడుకోని, ఏదో చిన్న విషయంమీద తగువు తెచ్చుకుంటారు. ఏ ఒక్కరు కాస్త పోనీలెమ్మని సర్దుకున్నా సరిపోతుంది. కాని అలాగా కాదే!

నాగూ-జోగూ ఇద్దరూ అన్నా చెల్లెళ్లు. నాగూ పట్టిగడుగ్గాయి. ఏదోవిధంగా చెల్లెలుజోగూని ఏడిపిస్తూ ఉంటాడు. జోగూకి ఉక్రోషం ఎక్కువ. పెద్ద చిన్న చూడకుండా నోరు పారేసుకుంటుంది. అంతే వాళ్ళిద్దరూ చెడ్డపిల్లలేనని కాదు. [illegible]న విషయాలలో ఇద్దరూ బుద్ధిమంతులే.

ఒకనాడు అన్నా, చెల్లీ ఇద్దరూ కూర్చొని వైకుంఠపాళీ ఆడుతున్నారు. అమ్మ వంటింట్లో పని చేసుకుంటున్నది. వైకుంఠపాళీ అంటే తెలుసుగదూ!



"ఈ సారయినా కొంచెం మంచిగా ఉండు తాతా! పైకి వస్తావు."



బార్లుతీర్చిన రిక్షాలు

ఉప్పలూరి వెంకట శ్రీనివాసరావు—విజయవాడ.

ఉంటాయి. ఈ ఆట ఆడుతున్నారు ఇద్దరూ.

ఆటమధ్యలో ఏమయిందంటే, నాగూకి పందెం నాలుగుపడింది. నాలుగుపడితే వాడిపావును పాము కరుస్తుంది. అందుకని వాడేం చేశాడు? "లేదు. నా పందెం మూడే పడింది!" అని జోగూని మోసం చెయ్యాలని చూశాడు. జోగూ అన్నది. "పాపం! నాలుగుపడితే మూడనిచెప్తున్నావా! నేను చూడ లేదనుకున్నావా?"

కాదని వాడు, అవునని ఇది, ఇద్దరూ తగువులాడుకున్నారు. "అయితే నేను ఆడనే ఆడను పో." అని నాగూ పటం ముత్తంకదిపి, పావులుతీసేశాడు. జోగూకి కోపం వచ్చి, "నువ్వెప్పుడూ ఇంతే. నిజంగా పాము కరుస్తుందిలే నిన్ను." అని వాణ్ణి ఒక మొట్టికాయ వేసింది. వాడు "మనిద్దరం ఎప్పుడూ ఒకే చోట ఉంటాంగా! నన్నుకరిస్తే ఆ పాము నిన్నుమాత్రం కరవదని ఏమిటి?" అంటూ వెక్కిరించాడు. ఇంతలో ఏమయిందనుకున్నారు?

బుస్, బుస్‌మని ఇద్దరికీ వినిపించింది. భయం వేసి ఇద్దరూ ఒకళ్ళ చెయ్యిఒకళ్లు గట్టిగాపట్టుకున్నారు. వాళ్లు నిలబడ్డచోట పెద్దకన్నం ఏర్పడింది. కళ్లుమూసి తెరిచేసరికి వాళ్లు ఒకపెద్దపాము పడగమీద ఉన్నారు. మరుక్షణంలో ఇద్దరూ ఆ పాము మీదుగాకిందికి ఎక్కడికో జారిపోతున్నారు. చిట్టచివరికి వాళ్ళ కాళ్ళకి కింద గట్టిగా నేల తగిలింది. వణికిపోతూ కళ్లు తెరిచిచూశారు. వాళ్ళని కిందికి దింపిన పాముతోక పైన కొంచెంసేపు కదులుతూ కనిపించి, ఆ తరువాత మాయమైంది.

జోగూ అన్న చెయ్యిపట్టుకొని, "ఇదేమిటి అన్నాయి!" అని అడిగింది. నాగూమాత్రం ఏం చెప్తాడు? చుట్టూరా చూశారు. అది ఒక పెద్దయిసుకపఱ్ఱ. కావలసినంత వెలుతురుగాలి ఉన్నాయి. కాని నీళ్లుకాని, చెట్టుకాని కనుచూపుమేరలో లేవు. ఆకలిఅవుతున్నది. ఇంటిదగ్గర అమ్మ అన్నంవండి ఎదురుచూస్తూ ఉంటుంది. తాము ఇప్పుడు ఎక్కడ ఉన్నారు? ఇంటికి ఎలా వెళ్లాలి?

ఇంతలో ఎవరో ఒకముసలివాడు ఒకబుట్టపట్టుకొని అటే వచ్చాడు. అతన్ని అడిగితే అంతా తెలుస్తుంది కదా అని వాళ్ళిద్దరూ వెళ్ళి "ఇదే

 అల్లరి పిల్లలు 

ఊరు? మాయింటికి ఎలావెళ్లాలి?" అని అడిగారు. ఆ ముసలివాడు బుట్ట దాచుకుంటూ, మీరిప్పుడే వచ్చారన్నమాటఇక్కడికి. అవునా? నేను ఎప్పుడో వచ్చాను. మళ్ళీ పైకి వెళ్దామంటే నిచ్చెనదొరకక బాధ పడుతున్నాను. అదృష్టం బాగుండి నాతరువాత వచ్చినవాళ్లు కూడా కొంతమంది నిచ్చెనదొరికి ఇక్కడి నుంచి వెళ్ళిపోయినారు." అన్నాడు.

ఓహో! అదన్నమాట సంగతి! నాగూకి అప్పుడు అర్థమైంది. "అది కాదు చెల్లీ నేనేమో నిన్ను మోసం చెయ్యాలని చూశాను. నీవేమో నన్ను పాముకరవాలని చెడ్డకోరిక కోరుకున్నావు. అందుచేత మనల్ని పాముకఱిచి ఇక్కడికెక్కడికో తెచ్చింది." అని అన్నాడు. "అంతేఅయిఉంటుంది." అన్నది జోగూ.

వైకుంఠపాళిలో ఆడిన ఆటలాంటిదే ఇప్పుడు నిజంగా జరిగింది. ఇప్పుడు నిచ్చెనవస్తే పైకి వెళ్ళిపోవచ్చును. కాని నిచ్చెన ఎలావస్తుంది? ఆట యితే పందెంవెయ్యవచ్చును

నాగూ అప్పుడు తాతతో మళ్లీ ఇలాఅన్నాడు. "తాతా! మాకు బాగా ఆకలివేస్తున్నది. తింటాని కేమయినాఉంటే పెట్తావా?" తాత చిరచిరలాడుతూ "నేనీపళ్లు ఎక్కడికో వెళ్లి పట్టుకొచ్చుకున్నాను. మీకు తేరగా ఇవ్వటానికి కాదు. పొండి, పొండి." అని కసిరాడు. నాగూకి కోపంవచ్చి బుట్టమీదికి ఎగబడి లాక్కోబోయినాడు. తాత పెద్దవాడయ్యె. తాను నాలుగుపళ్లు లాక్కొని పరుగెత్తితే ఏంచెయ్యగలడు? అని అతని ఉద్దేశ్యం.

కాని జోగూ అడ్డువచ్చి "తప్పు. అన్నయ్యా. తొందరపడి ఒకతప్పు చేసినందుకు ఇద్దరమూ ఇక్కడికి జారివచ్చాము. మళ్ళీ అలాగే చేస్తుంటే ఇంకో పాము వస్తుంది." అనిబుద్ధిచెప్పింది. నాగూ గ్రహించి "అవునుచెల్లీ. నాదే పొరపాటు" అని చెంపలు వేసుకున్నాడు.

ఆశ్చర్యం! వెంటనే వాళ్ల వెన కాల బరబర చప్పుడు చేసుకుంటూ ఒక నిచ్చెన దిగింది. జోగూ నాగూ చేయిపట్టి లాగుతూ "చూశావా? అన్నయ్యా! మనకోసమే నిచ్చెన. మంచిగా ఉంటే ఎంత లాభమో చూశావా?" అని అంటూ నిచ్చెన దగ్గరికి బయలుదేరింది. ఇద్దరూ నిచ్చెనమీదికి ఎక్కటం ఆరంభించారు. అప్పుడు జోగూ తాతతో చెప్పింది. "తాతా! అదృష్టం బాగా ఉండటం కాదు కావలసింది. అందరితో మంచిగా ఉండటం. అప్పుడు కాని పైకి పోవాలంటే నిచ్చెన దొరకదు."

తాత కంగారుపడుతూ, నా "బుట్టెడు పళ్లూ కావాలంటే ఇచ్చేస్తానర్రా. నన్ను గూడ మీతో రానివ్వండి." అని నిచ్చెన దగ్గరికి వచ్చాడు. కాని అది అతనికి అందలేదు. ఇద్దరూ గట్టిగా "ఈ సారయినా కాస్త మంచిగా ఉండు తాతా! పైకి వస్తావు" అని అరిచారు. ఇంతలో వాళ్లిద్దరూ మరోచోటికి వచ్చేశారు. నిచ్చెన వాళ్ల నక్కడికి చేర్చి మాయమైంది.

వాళ్ళిద్దరూ ఆశ్చర్యపడుతూ, మళ్లా ఇక్కడినుంచి ఎలాగా పైకి

పోవటం అని ఆలోచించసాగారు.

ఇంతలోకే వాళ్ళకు సరిగ్గా నెత్తిమీద ఒక పాము తోక కనిపించింది. వాళ్ళు అలా చూస్తూ ఉండగానే ఒక అబ్బాయి జారి వచ్చి, కొంచెం ఎత్తునించి కింద పడ్డాడు. ఆ అబ్బాయి వీళ్ళకంటె కొంచెము చిన్నవాడు. అందుచేత ఏడవటం మొదలు పెట్టాడు. నాగూ, జోగూ అతనిదగ్గరికి వెళ్ళి ఓదార్చారు. అతడు దెబ్బ తగిలి కొద్దిగా నెత్తురు వస్తున్న కాలు చూపించాడు. వెంటనే నాగూ పరుగెత్తుకొని వెళ్లి దగ్గరిలో ఉన్న మడుగులోనుంచి నీళ్ళు తెచ్చి కడిగాడు. జోగూ కట్టు కట్టింది. అతనిమీద వాళ్లు చూపిన ఆదరానికి ప్రతిఫలంగా మరొక నిచ్చెన దిగింది. నాగూ, జోగూ ఆ నిచ్చెన ఎక్కి మళ్లా పైకి చేరుకున్నారు.

వారలా చేరుకున్నది ఎక్కడికని? సరిగ్గా వాళ్ళ ఇంటి ప్రక్కన ఉన్న పెద్ద జాగాలోకి. నాగూ సంతోషం పట్టలేకపోయినాడు. "చెల్లీ! మనం మన యింటికి వచ్చేశాము. రా! రా! పరుగెత్తుకుపోదాం" అంటూ జోగూ చేయి పట్టుకొని లాక్కుపోసాగాడు. పాపం! ఆడపిల్ల మరి వాడితో సమానంగా పరుగెత్తగలదా! పరికిణీచెంగు కాళ్ళకి అడ్డంపడి పడిపోయింది.

ఇంటిదాకా వచ్చి, ఇంట్లోకి పోబోతుండగా, తనతో పాటు రాకుండా పడిపోయినందుకు నాగూకి చిరాకు వేసింది. జోగూని లేవదీయకుండా విసుక్కోవటం మొదలు పెట్టాడు. దానితో మళ్లా అంతా మొదటికి వచ్చింది.

ఒక పెద్ద పాము ఎదురుగా ఉన్న ఒక కన్నంలో నించి తల తీసి బయటికి వచ్చింది. నాగూ ఆ పాము మీదిగా జారిపోవటం మొదలు పెట్టాడు. ఇంత దెబ్బ తగిలినా, అన్నయ్య జారిపోవటం చూచి జోగూ కంగారు పడింది. ఒక్కటే పోతున్నాడు. ఏమి ఇబ్బంది పడతాడో అని భయపడి, తాను వాడితోపాటు ఆ కన్నంలోకి ఉరికింది. ఇద్దరూ జారి జారి అడుగుకు వచ్చారు.

"చూశావా! ఒక్క పొరపాటు వలన అంతా మొదటికి వచ్చింది. పని తీరింది కదా అని మళ్లా నువ్వు యథాప్రకారం చెడుగా ప్రవర్తించావు." అన్నది జోగూ.

నాగూకి సిగ్గు వేసింది. "ఔను చెల్లీ! నాది పొరపాటే" అని ఒప్పుకున్నాడు. వెంటనే ఒక నిచ్చెన వాళ్ళకి కనిపించింది. జోగూ అన్న చేయి పట్టుకొని తీసుకువచ్చి నిచ్చెన ఎక్కించింది. తానుఎక్కటం మొదలు పెట్టింది.

నాగూ అన్నాడు. "నేను చెడ్డ వాడిని. కనుక అడుగుకు జారిపోయినాను; నాతో ఉన్నందుకు నీవూ ఇప్పుడు అడుగుకి రావలసి వచ్చింది. నీవు మంచిదానివి. నీకోసం నిచ్చెన వచ్చింది. నీతో ఉన్నందుకు నాకూ నిచ్చెన దొరికింది. పైకి రాగలిగాను. మంచి వాళ్ళతో సావాసం చేస్తే ఇలా, చెడ్డవారితో సావాసం చేస్తే అలా."

ఇద్దరూ పైకి వచ్చి చూసేసరికి ఈసారి వాళ్ళ యింటి ముందు ఉన్నారు. తలుపు తట్టగానే అమ్మ వచ్చి తలుపు తీసింది. "మీరిద్దరూ ఇంట్లో లేరుట్రా! తిరగటానికి ఎప్పుడు వెళ్లారు?" అని అడిగింది. వాళ్లు జరిగినదంతా వినిపించారు.

అమ్మ నవ్వింది. "మీ మొహం! అంతా ఉట్టిదే. ఈ కథ ఎక్కడ నేర్చారు?" అని అడిగింది. అమ్మకేం తెలుసు? ఎంత చెప్పినా నమ్మలేదు. "మీ రిద్దరూ ఆగదిలో ఉండగా నేను పావుగంటక్రింద చూశాను. ఈ పావు గంటలో ఎట్లా జరిగింది?"

నాగూ, జోగూ ఇద్దరూ ఆశ్చర్య పోయినారు. "ఇంకా పావుగంటేనా అయింది - ఏ నాలుగయిదు గంటలో అయితే!" అన్నారు. ఎవరికి చెప్పినా ఈసంగతి నమ్మరు. కాని నాగూ, జోగూ మాత్రం చాలా మారిపోయినారు. ★

—ముపీ.



# అయోమయం



ఆరోజు క్రిస్మసు పండుగదినం. అందరూ సాయంకాలం ప్రార్థనకై చర్చివద్ద చేరారు. మతగురువు ప్రార్థన మొదలుపెట్టాడు. పిల్లలంతా బయట ఆడుకుంటున్నారు.

ఆవూళ్లో రెండేళ్ల గిత్తదూడ ఒకటిఉంది. అది శుద్ధ పోట్లగొడ్డు. దాన్ని ముట్టుకుంటే చాలు-తరుముకొచ్చి క్రిందపడేసి పొడిచి పొడిచి వదిలిపెడుతుంది. అది చర్చి బయట ఎక్కడో మేస్తున్నది. ఎవడో ఒక కొంటెవెధవ దాని దగ్గరకు వెళ్లి ఏంచేశాడో ఏమో తరుముకువచ్చింది. ఆ కుర్రాడు హడలిపోయి పరుగు పుచ్చుకున్నాడు.

చర్చి దగ్గరికి వెళ్లేటప్పటికి అది కుర్రాడిని సమీపించింది. వాడు చటుక్కున చర్చిలోకి దూరాడు. దూడకూడా వాడిని వదిలిపెట్టక వెంటబడి చర్చిలోకి వెనకాలే తరుముకువచ్చింది. చర్చిలో సూది దూపడానికి కూడా స్థలం లేకుండా తొక్కిడిగా ఉంది. ఆ దూడ జనంలో పడి వాళ్లందర్నీ చెల్లాచెదరు చేసి, ఆ కుర్రాడిని కొమ్ములతో ఎత్తి పారేసింది.

ఆ విసురుకి వాడు వెళ్లి తలక్రిందులుగా ఒక ముసలమ్మమీద పడ్డాడు. ఆమె వెళ్లి గోడకు కరుచుకున్నది. తలకు గట్టిగా తగలడంచేత పెద్దగా అరుస్తూ "అయ్యో! వీడి అమ్మ కడుపుమాడ! చంపేశాడ్రోయ్" అని తిట్టడం లంకించుకొంది.

ఆ దూడ అంతటితో ఊరుకోక అడ్డంవచ్చినవారినెల్లా కుమ్మడం మొదలెట్టింది. ఆ గందరగోళం

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

**యన్. బాలభారతసింగ్**

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

చూసి తీరాలి. ప్రార్థనామందిరంలో ముందుభాగాన ఉన్నవారికి యీ గందరగోళం ఏమిటో అర్థం కాలేదు. కాని ద్వారందగ్గరనుండి కేకలు, పెడబొబ్బలు స్పష్టంగా వినిపిస్తున్నాయి. అందుచేత వాళ్లంతా ప్రార్థన మానేసి ఆగోల ఏమిటని ఒకళ్ల నొకళ్లు అడుగుతూ, కంగారుపడటం మొదలెట్టారు.

వేళాకోళానికి ఒకడు పక్కవాడితో "ఏకుక్కఅయినా లోపలికి జొరబడి ఉంటుంది" అన్నాడు. ఆపక్కనేవున్న ఒకఆమె హడలిపోయి, చర్చిఅంతా ప్రతిధ్వనించేటట్లు "అమ్మాయ్! ఎక్కడ ఉన్నావే? ఇల్లారా కరచి, చంపేస్తుంది." అని అరిచింది. లోపల ఉన్నవాళ్లంతా ఒకళ్ళనొకళ్లు తోసుకుంటూ క్రిందా మీదాపడటంలో దీపంక్రింద పడిఆరిపోయింది.

దీపాలు ఆరిపోవడంచేత చర్చి అంతా చీకటిమయం అయింది. ఇంతలో ఎవడో 'చర్చి అంటుకుంది' అని అరిచాడు. దీపాలుకూడా ఆరిపోవడంలో మరీ గందరగోళం అయిపోయింది.

"పిచ్చికుక్క!"

"కాలిపోతూంది"

"నడవండి! నడవండి!"

"ఏమిటి యీగోలఅంతా? కొంప మునిగింది."

"యేదో ప్రమాదం జరిగింది."

అనుకుంటూ అందరూగుమ్మాల వైపుకు తోసుకురావడం ప్రారంభించారు. ఆ సమ్మర్దంలో మనిషి కదలడానికి కూడా వీలు లేకపోయింది. చర్చి కావలాదారు 'దొంగలు దొంగలు' అని అరుస్తూ పరవళ్లు తొక్కాడు.

ఆడవాళ్లందరూగొఱ్ఱెలమందల్లా మతగురువువైపుకు త్రోసుకురావడం ప్రారంభించారు. అర్చకుడు

చేతిలోనున్న పళ్లెంతో వాళ్ల నెత్తి మీద కొట్టి వెనక్కు తరుముతూ "ఇలా ఎక్కడికి? లోపలికి వచ్చి అపవిత్రం చేస్తారా? — ఛీ! అవతలకు పొండి. ఆడవాళ్లు ఇక్కడికి రాకూడదని తెలీదూ?" అని కేక లేశాడు.

ఆ రోజు గ్రామాధికారి కూడ చర్చిలో ఉన్నాడు. అతడు లావుగా పిప్పళ్ళ బస్తాకు కాళ్లు పెట్టినట్లుంటాడు. గున గునా నడుస్తూ ఎలాగో కష్టపడి ద్వారందాకా వచ్చాడు. కాని అక్కడనించి ఇక వెళ్ళలేక 'ఏయ్! — నన్ను వెళ్ళనియ్యండి.! నేనూ — గ్రామాధికారిని. తప్పుకోరేం?" అని చలాయించాడు.

గ్రామాధికారి అయితే కావచ్చు కాని ఆ సమయంలో అతనిమాట వినేవాళ్లు ఎవరు. ఎవరిమటుకు వాళ్లు అయోమయంలో పడిఉన్నారు. అసలు ఈ గందరగోళానికి కారణం ఎవరికీ తెలియదు. కాని తలోకమాట చెప్పి బ్రహ్మాండం చేశారు. చివరకు ప్రార్థన జరగలేదు సరికదా! తలుపులూ, కిటికీ ఊచలూ విరిచి చావు తప్పి కన్ను లొట్టబోయినంత పనితో అందరూ బయట పడ్డారు.

అందరూ బయటికి వచ్చి చూద్దురుగదా చర్చికి ఏ అపాయం లేదు-వీళ్ళు పగులగొట్టిన తలుపులు కిటికీ ఊచలు మినహా. అంత గందరగోళానికి కారకుడైన ఆ అబ్బాయి అక్కడనే ఉన్నాడు. కాని అతనికి కూడా కారణం తెలియదు. అందరూ అలాగే అయోమయంగా ఉండి పోయినారు. 

(రష్యన్ కథ ఆధారంగా)

##  విజ్ఞాన వీధులు 

(11-వ పేజీ తరువాయి)

ప్రయోగ సాక్ష్యము నిజము. ఆ ప్రయోగంలో అది నిజము, ఈ ప్రయోగములో ఇది నిజము. ఇక కణమూ, తరంగమూ అన్నవి మనము ఊహించిన తత్వాలు. ఎలక్ట్రానును చేరేవరకూ ఈ తత్వాల స్వభావ విజ్ఞానానికి దెబ్బతగలలేదు. ఎలక్ట్రానును చేరేసరికి తగిలింది దానికి జవాబు ఎలక్ట్రానుయొక్క కణతరంగత్వము లేదా తరంగ కణత్వమును గుర్తించుట. అంతేగాని ఈ కుక్కతోక పట్టుకుని బృహత్ప్రపంచ ప్రయోగసత్యాల్ని ప్రశ్న వెయ్యడం కాదు. మీదు మిక్కిలి ఈ అనిర్దేశిత్వాన్ని పట్టుకుని జ్యోతిషంలో కనపడే అనిర్దేశిత్వాన్ని సమర్థించబోవడము మహా సాహసం వెనకటికి ఇద్దరు స్నేహితులు పెరళ్ళలో నూతులు తీయించారట ఒకనికి ఆ మట్టిలో తీగలు దొరికినవి - ఆతడు పొరుగువానితో "చూడవోయి మిత్రమా మన పూర్వులు టెలిగ్రాఫూ, టెలిఫోనూ ఎరగరని ఈ సాక్ష్యాన్ని చూస్తూ ఎలాగనగలను?" అన్నాడట. రెండవవానికి (*Wires*) ఏవీ దొరకలేదు. "ఏమోయి నేస్తమూ, ఈ సాక్ష్యం చూస్తూ పూర్వులకు *Wireless* తెలియదని ఎలాగనడమూ?" అన్నాడట. అలాగ మన వెంకటరావుగారికి జ్యోతిషం యొక్క అనిర్దేశిత్వాన్ని సమర్థించడానికి ఎలక్ట్రాను తత్వంలోని అనిర్దేశిత్వం దొరికింది. జ్యోతిషంయొక్క నిజము నిశ్చయము కాదంటే, "నిజముయొక్క తత్వమే నిశ్చయంకాదు" అనేవరకూ వెళ్లేరు. ఇది నిజంగా అతీంద్రియ శక్తే—వెంకటరావు గారు మరొకరీతిగా జవాబు చెప్పవచ్చును. "ప్రయోగంవల్ల నేకాక అతీంద్రియ శక్తివల్ల కనుక్కున్నది - విజ్ఞాన సూత్రాలకు వ్యతిరేకంగా కనపడినా - నిజమే కావచ్చునని." అవును. అతీంద్రియ శక్తివల్ల కనుక్కున్నది మన మెరిగిన నిజాలకు పైనవుండే నిజమే అయితే ఈ శాస్త్రం అతీంద్రియ శక్తివల్ల కనుక్కున్నదనడానికి సాక్ష్యము, ఆధారము, అధికారము, ఏమీ వుండనక్కరలేదా? అని అడుగుతాను. త్యాగరాజస్వామి 'గ్రహబలమేమి, రామానుగ్రహబలమే బలము' అన్నాడు. పురందరదాసు విఠలస్వామితో "నీవే నా చంద్రసూర్యులు, నీవే నాగురుడు" అన్నాడు. వారతీంద్రియ సంపన్నులు కారంటారా? రామకృష్ణస్వామి అదృశ్యయోగము వంటి సిద్ధులే లోకప్రయోజనాలకు ఉపయోగిస్తే ఎఫీరిపోతా యన్నాడు. అలాగ ఎగిరిపోయిన ఉదాహరణము చెప్పినాడు. అతీంద్రియ శక్తిని మానవుల ఐహిక ఫలసూచనకుపయోగించిన మహానుభావు డెవడు? సత్యాచార్యుల దొక పద్ధతా? జైమినిది మరొకటా? బృహస్పతిది శకునమా? మరొకరిది పుట్టుమచ్చల శాస్త్రమా? ఇంకొకరిది గౌళి పలుకా? ఇవన్నీ అతీంద్రియశక్తివల్ల సాధించినవా? ఏమిటండీ ఈ డబాయింపు అంటే "ఓ పెళ్ హీమరుకే తెలియడం లేదు చూసుకోమని వెక్కిరింతలా? ఇదంతా చక్కగా తెలిసిన విషయంగురించిన ప్రస్తావనేనా? ★

# గ్రంథసమీక్ష

## కథాసాగరం 9, 10, 11 :

'శివం,' పంతుల శ్రీరామశాస్త్రి, వాసిరెడ్డి సీతాదేవిగార్ల కథల సంపుటాలు ఒక్కొక్క సంపుటి రూపాయి - దేశీ ప్రచురణలు, విజయవాడ 2

ఒక్కొక్క కథకుని కథానికలను ప్రత్యేక సంపుటాలుగా దేశీప్రచురణకర్తలు ప్రచురిస్తున్న కథాసాగరంలో ఇవి మూడు ఈ విధమైన ప్రచురణవల్ల ఆయా కథకుల ప్రత్యేకతను మరింత సులువుగా విస్పష్టపరిచే అవకాశం కలుగుతున్నది

"జీవితంలోని సామాన్య సంఘటనలనూ, సంఘర్షణలనూ" చిత్రించడం, రకరకాల వ్యక్తుల భావోద్వేగాల "స్వభావాలను సత్యాన్ని పరిశీలించి వ్యక్తీకరించడం" 'శివం' గారి లక్ష్యం వీరి కథానికల్లో చాలవరకు దారిద్ర్యంతో నలిగే మధ్యతరగతి వ్యక్తులకు, సంసారాలకూ సంబంధించినవి. జీవితసంగ్రామంలో నిలవలేక భయపడుతూ చేతులతో కళ్లు కప్పుకొని కలవరించే వ్యక్తులే చాలమంది ఈ కథానికల్లో ప్రత్యక్షమౌతారు. కోపధారి అయిన, ఉపాధ్యాయుడు అక్రమంగా శిక్షించడం సహాధ్యాయులు నలుగురిలో నగుబాటుపాలవడం రంగారావు అసమర్థతకు కారణమన్నట్లు "అసమర్థుడు" అనే కథానికలో సూచించారు మిగిలినవానిలో దారిద్ర్యం, మధ్యతరగతి మానవుల వింత మనస్తత్వాలు ఈ భయంకరమైన జీవితానికి హేతువులన్నట్లు రచనలు చేశారు మొత్తానికి వీరు చిత్రించిన వ్యక్తులు భయపీడితులు. జీవితం భయంకరం ఎక్కడా ఆశగాని చిరునవ్వుగాని కనపడదు. విషయానికి అనుగుణంగా రచనా సంవిధానం సాగుతుంది

పంతుల శ్రీరామశాస్త్రిగారి కథలలో

(56-వ పేజీ చూడండి)



సొహ్రాబ్ మోడీ నిర్మిస్తున్న "కుందన్"లో నిమ్మీ.



ఏప్రిల్ 28 న విడుదల అయిన "అనార్కలీ"లో నాగేశ్వరరావు, అంజలీదేవి.

# పెద్దతెరలూ, అధికలాభాలూ

మద్రాసు నగరంలో ఇంగ్లీషు చిత్రాలు ప్రదర్శించే నాలుగు సినిమా మందిరాలు పెద్దతెరలూ స్టీరియోఫోనిక్ శబ్దయంత్రాలూ అమర్చుకున్నాయి. సినిమాస్కోప్ చిత్రాలూ, ఇతరములైన పెద్దసైజు చిత్రాలూ ఒకదానివెనుక ఒకటి వస్తున్నాయి. పెద్దసైజు చిత్రాలు రానప్పుడు మామూలు చిత్రాలను కూడా ఈ తెరలమీద ప్రదర్శించే వీలున్నందువల్ల థియేటర్లకు ఏ యిబ్బంది కలగడం లేదు. త్రీ-డీ చిత్రాల రాక తగ్గిపోయింది. సినిమాస్కోప్ చిత్రనిర్మాణం ఎక్కువైంది. దీనితోపాటు చిత్రాలకు రాబడికూడా పెరిగింది.

గడచిన యేడాదిలో హాలీవుడ్ పరిశ్రమ చాలా గొప్పవిజయం సాధించింది. టెలివిజన్ పోటీవలన దాపుతప్పి కన్నుకొట్టుపోయిన హాలీవుడ్ పరిశ్రమ తిరిగి తనకాళ్ళమీద తాను నిలబడగలగడమే కాక, ఇదివరకెన్నడూ కనివిని ఎరగనంతటి ఆర్థిక విజయం సంపాదించింది. టెలివిజన్‌కు సాధ్యంకాని కొత్త పద్ధతిని కనిపెట్టి, ఆ పోటీని పూర్తిగా నిర్మూలించింది. ఆ కొత్త పద్ధతే సినిమాస్కోప్. లక్షలకొలది డాలర్లు ఖర్చుపెట్టి తీసిన యీ చిత్రాలు అమెరికాలో ప్రేక్షకులను విపరీతంగా ఆకర్షిస్తున్నాయి. కొన్నికొన్ని చిత్రాలకు యాభై, అరవైలక్షల డాలర్లు కూడా ఖర్చవుతున్నది. ఈ చిత్రాలముందు టెలివిజన్‌గాని, తక్కిన మామూలుసైజు చిత్రాలుగాని సూర్యునిముందు దివిటీలవలె వెలవెలబోతున్నాయి. పెద్దసైజు చిత్రాల నిడివికూడా మామూలుకంటె ఎక్కువగా వుంటున్నది. ఇదివరకు చిత్రాలు 90 నిమిషాలు పడితే, ఇప్పుడు 110 నిమిషాలు (సగటున) నడుస్తున్నాయి. దీనితో తాము నిజంగానే బ్రహ్మాండమైన చిత్రాలను చూస్తున్నామనే భావం ప్రేక్షకులలో కలుగుతోంది.

పెద్ద తెరతోపాటు చిత్రాలలోకూడా చాలా మార్పులు వచ్చాయి. కథ, పాత్రల మనస్తత్వాలు, సంఘర్షణ మొదలైన విలువలు పాతబడిపోయాయి. దృశ్యం, దాని ఆకర్షణ, ప్రభావం ఇవే ప్రధానమైన విలువలైనాయి. చిత్రం చూస్తున్నంతసేపూ ప్రేక్షకుణ్ణి కథకంటే, కంటికి కనిపించే విశాలమైన సుందరదృశ్యాలే ఎక్కువ ఆకర్షిస్తున్నాయి. మానసికమైన అనుభూతులకంటె భౌతికమైన దృశ్యాలకే విలువ హెచ్చింది. అంతే కాదు, పెద్ద సైజు తెరలవల్ల ప్రేమ కథలను చిత్రించడం కూడా కష్టమైపోయింది. ప్రేయసీ ప్రియులు ఇదివరకులాగా సులభంగా ముద్దులు పెట్టుకోడానికి వీల్లేకపోతోంది. రెండు తలకాయలను క్లోజప్ ఫ్రేమ్‌లోకి ఇరికించవలసివచ్చేటప్పటికి పైనో, కిందనో తలలు తెగిపోయినట్లు కనిపిస్తాయి. క్లోజప్ లేకుండా ముద్దుల దృశ్యమే అనవసరంకదా!

కాని ఈ కొత్త టెక్నిక్ 'సెన్సరన్న'



“కన్యాదానం”లో సి. ఎస్. ఆర్.



## పెద్దతెరలూ, అధికలాభాలూ



అనబడే రకం చిత్రాలకు బాగా ఉపకరిస్తోంది. వెస్టర్న్ చిత్రాలలో విశాలమైన ప్రకృతి దృశ్యాలకు, అనేకులు జనులు కూడిన దృశ్యాలకు ప్రాముఖ్యం హెచ్చు.

ఈ పెద్దచిత్రాలవల్ల మరోక మార్పు కూడా వచ్చింది. ఈ చిత్రాలను తీయడానికి ఎక్కువ కాలమూ కావాలి, ఎక్కువ ధనమూ కావాలి. అందుచేత ఇదివరకుకంటె తక్కువ చిత్రాలే తయారవుతున్నాయి. 1948 లో హాలీవుడ్ నుండి 435 చిత్రాలు వచ్చాయి. 1953 లో 354, 1954 లో 267 చిత్రాలుమాత్రమే వచ్చాయి. చిత్రాల సంఖ్య తక్కువైనా, లాభాలు బాగానే వస్తున్నాయి కనుక నిర్మాతలకేమీ బాధ లేదు కాని ఎగ్జిబిటర్లకు మాత్రం కటకటగా వున్నదట. చిత్రాల కొరతను భర్తీచేయడానికి అమెరికన్ ఎగ్జిబిటర్లు ఇటాలియన్, ఫ్రెంచి, బ్రిటిష్, ఆఖరికి జాపనీస్ చిత్రాలను కూడా ప్రదర్శించవలసివస్తోందట. అయితే ఈ చిత్రాలు ఉత్తమంగా వుండడం వలన ప్రేక్షకులు వాటినికూడా చూస్తున్నారు.

ఈవిధంగా అమెరికన్ సినిమా పరిశ్రమ ఆర్థికంగా తిరిగి పుంజుకొన్నది. ★

నేషనల్ ఫిల్ము బోర్డును స్థాపించడానికి కేంద్ర సమాచార శాఖామంత్రి డా॥ బి. వి. కేస్కార్ చేసిననిర్ణయం చిత్ర నిర్మాతలలో దాదాపు ఎవరికీ ఇష్టంలేదనే చెప్పవచ్చును. తమ నిర్మాణ కార్యకలాపానికి ఈబోర్డు అడ్డం వస్తుందని, ప్రైవేటు పెట్టుబడిమీద ఆధారపడిన ఫిలింపరిశ్రమలో ఉత్సాహాన్ని అది చంపివేస్తుందనీ వారు భావిస్తున్నారు. తమ చిత్రాలస్థాయి విషయంలోగాని, నిర్మాణంలోగాని ప్రభుత్వపు ప్రమేయం వుండరాదని వారంటున్నారు. ఫిలిం ఫైనాన్స్ కార్పొరేషన్ మాత్రం కావాలని నిర్మాతలు కోరుతున్నారు. నేషనల్ ఫిలింబోర్డులో ఫైనాన్సు కార్పొరేషన్ ఒక ప్రధానాంగం అని తెలుస్తోంది.

ఏ పెట్టుబడిదారూ తాను పెట్టుబడి పెట్టబోయేచిత్రంలో కథ, నటీనటవర్గం, సంగీతం, నిర్మాణపద్ధతి పెట్టుబడికి నష్టం లేకుండా వుండేలాగు చూచుకొనిగాని ధనం ఇవ్వడు. సాధారణంగా డిస్ట్రిబ్యూటర్లే పెట్టుబడి పెడతారు. చిత్రనిర్మాణంపై అతడెంతవరకూ అధికారం కలిగివుంటాడో అందరికీ తెలిసిందే. అందుచేత నేషనల్ ఫిలింబోర్డును నిర్మాతలవర్గం విమర్శించడం హాస్యాస్పదంగానే వుంది. హాలీవుడ్‌లో కూడా, బ్యాంకులు, తదితరములైన పెట్టుబడి సంస్థలూ చిత్రనిర్మాణంపై అధికారం కలిగివుంటాయి. డబ్బు బాగా వస్తుందని తమకు తోచిననాటికే అవి పెట్టుబడి పెడతాయి.

ఒక పెద్ద న్యూయార్కు బ్యాంకిలో చిత్రాలకు అప్పులిచ్చే శాఖ ఉపాధ్యక్షుడు ఇలా అన్నాడట: “ఏ నిర్మాతకైనా మేము డబ్బు యిచ్చేముందు షూటింగ్ స్క్రిప్టును పరిశీలిస్తాము. అది మా దృష్ట్యా మంచి చిత్రం కాగలదో లేదో చూస్తాము. ఒక్క గంటకూడా వృథాకాకుండా నిర్మాణం సక్రమంగా జరిగిపోవాలని ఒత్తిడిచేస్తాము. చిత్రనిర్మాణంలో కాలానికి ధనానికున్నంత విలువ వున్నది.” మంచి చిత్రం అంటే ప్రేక్షకులు డబ్బు ఖర్చుచేసి చూడదగినంత వినోదం యిచ్చే చిత్రం అని అయన నిర్వచించాడు. మంచి చిత్రం నిర్మాణానికి రచయితల, డైరెక్టర్ల, నటుల, టెక్నీషియన్ల నైపుణ్యం యావత్తూ క్రమపద్ధతిలో, లాభసాటిగా వినియోగించబడుతుంది. తాము పెట్టుబడి పెట్టే చిత్రాలనిర్మాణంపై అధికారం లేకుండా ఏ ఫైనాన్సు కార్పొ



"లే మిజరబ్లే" అనుకరణ అయిన "కుందన్" చిత్రంలో జాఁ వాల్‌జాఁ కుమార్తెగా నిమ్మీ, ఆమె ప్రియుడుగా సునీల్ దత్. జాఁ వాల్‌జాఁ పాత్ర సొహ్రాబ్ మోడీ నటిస్తున్నాడు.

లేవనూ వడవజాలడు. హాలీవుడ్‌లో ఫిలిం శాఖ్యంకి ప్రతినిధి మాటకు ఎంత విలువ వున్నదంటే అతని మాటమీద తారలను, డైరెక్టర్లను, ప్రొడ్యూసర్లను కూడా స్టూడియో వారు డిస్మిస్ చేస్తారు. అందుచేత తమ ప్రయోజనాలను చూసుకొని అయినా నిర్మాతలు నేషనల్ ఫిలింబోర్డుకు తమ నిర్మాణాలపై కొంత అధికారం వుండనివ్వాలి. అయితే ఫిలింపరిశ్రమపై ప్రభుత్వ దృక్పథాన్ని నిర్వచించేది రాజకీయ వేత్తలు, సంఘసంస్కర్తలని పేరు పెట్టుకున్నవారూ కారాదు. ఫిలిం పరిశ్రమపై ఆసక్తి, అభిమానం వున్నవారే అలా నిర్వచించాలి.

*  *  *

ఈ ఏప్రిల్ 30 వ తేదీనాటికి ప్రముఖ నిర్మాతలలో ఒకరైన బి. ఎన్. సర్కార్ గారు ఫిలిం పరిశ్రమలో అడుగుపెట్టి 25 ఏళ్లు అవుతుంది. 1930 ఏప్రిల్ 30 తేదీ నుండి నేటివరకూ ఆయన 125 చిత్రాలు (బెంగాలీ 75, హిందీ 50) నిర్మించారు. ఆయన స్థాపించిన న్యూథియేటర్స్ సంస్థ మొదటినుంచీ ఉత్తమ స్థాయి చిత్రాలకు నిదర్శనంగా పనిచేసింది. ఆయన సంస్థ ఫిలిం కళకు దేవాలయం లాంటిది. సైగల్, మొలీనా, ఉమాశశి, కమలేష్‌కుమారి, పంకజ్ మల్లిక్, కె. ఎన్. సింగ్, పహాడీసన్యాల్, పృథ్వీబిశ్వాస్, అరుంధతీముఖర్జీ, కె. సి. డే, మొదలైన ప్రసిద్ధులు అక్కడే వృద్ధికి వచ్చారు. కన్ననబాల, పృథ్వీరాజ్, దుర్గాఖోటే మున్నగువారి నటనాకౌశలం అక్కడే పరిణతి చెందింది. బి. ఎన్. సర్కార్ క్రింద పేరుతెచ్చుకున్న డైరెక్టర్లు బిమల్ రాయ్, నితీన్‌బోస్, హేమ్‌చందర్, ఫణి మజుందార్, కిదార్ శర్మ మున్నగువారెందరో వున్నారు. ఆయన నిర్మించిన దేవదాసు, విద్యాపతి, డాక్టర్, ప్రెసిడెంట్, చండీదాస్, ముక్తి, యాత్రిక్ మొదలైనచిత్రాలు బాగా డబ్బు సంపాదించడమేకాక మంచి ఇతివృత్తం, ప్రయోజనం కలిగిన చిత్రాలనికూడా పేరు పొందాయి.

1955 సంవత్సరం బి. ఎన్. సర్కార్ జీవితంలో ముఖ్యమైనది. ఈ యేడాది ఆయన బొంబాయిలో నాలుగు చిత్రాలు నిర్మించ సంకల్పించారు.

*  *  *

మెహబూబ్ నిర్మిస్తున్న ప్రొడక్షన్ నంబర్ 7 లో వకీలా, కిశోర్ కుమార్ నటిస్తున్నారు. అనిల్ బిశ్వాస్ సంగీతం, సచిన్ శంకర్ నృత్యం సమకూరుస్తున్నారు. ఇంకా పేరు పెట్టని యీ చిత్రానికి ఆర్. మెహ్రీష్ దర్శకుడు.

మెహబూబ్ ప్రొడక్షన్స్‌వారి మరొక చిత్రం "ఆవాజ్" ను జియాసర్హాది డైరెక్టు చేస్తున్నాడు. పేదల కష్టాలు చూపించే యీ చిత్రంలో నళినీజయవంత్, ఉషా



విఠల్ ప్రొడక్షన్స్‌వారి "కన్యాదానం"లో చంద్రకళ, రమాదేవి, జానకి.

## ★ బొంబాయి సినిమాలేఖ ★

కిరణ్, శీలాచిట్నీస్, కొత్తనటి జాల్ వెలానీ నటిస్తున్నారు. అనిల్ చౌధురి సంగీత దర్శకుడు.

మెహబూబ్ సినాకలర్‌లో నిర్మిస్తున్న "మదర్ ఇండియా"లో నర్గీస్, రాజ్ కుమార్, కన్హయ్యలాల్, అమితా, ముక్రీ నటిస్తున్నారు. ఏప్రిల్ 8వ నర్గీస్‌తో ఈ చిత్రం ప్రారంభింపబడింది.

* * *

శారద ప్రొడక్షన్స్‌వారి "ఊంచీ హవేలీ"లో ఒక మనోహర స్వప్నదృశ్యాన్ని ఇటీవల జ్యోతి స్టూడియోస్‌లో షూట్ చేశారు. నిరూపరాయ్, కరణ్ దివాన్ నటించే యీ చిత్రాన్ని ఫీరూభాయ్ దేశాయ్ డైరెక్టు చేస్తున్నాడు. సంగీతం శివరాం, పాటల రచన భారత్ వ్యాస్. ఈ సంస్థవారే నిగార్ సుల్తానాతో "మస్తానీ" అనే చిత్రం "గుల్ బకావలి" అనే ఇంకో చిత్రం నిర్మిస్తారు.

* * *

ఎ. వి. ఎమ్. వారు తీస్తున్న పౌరాణిక చిత్రం "శివభక్త"లో పద్మిని, సాహూ మోదక్, అనంతకుమార్, కుమారిదేవి నటిస్తున్నారు. హెచ్. ఎల్. ఎన్. సింహా దర్శకుడు. హిందీ "స్వయంసిద్ధ"లో మంచి సంభాషణలు రచించిన మోహన్‌లాల్ బాజ్‌పాయ్ సంభాషణలు వ్రాశారు. పాటలు నేపాలీ, సంగీతం చిత్రగుప్త కూరుస్తున్నారు.

* * *

హోమీ వాడియా నిర్మిస్తున్న "హాతం తాయ్" అనే గేవాకలర్ చిత్రానికి స్పెషల్ ఎఫెక్ట్స్ నిపుణుడు బాబూభాయ్ మిస్త్రీ ఫోటోగ్రాఫరుగా వున్నాడు. ఈ చిత్రం చాలావరకు పూర్తయింది. షకీలా ఇందులో నటిస్తున్నది.

* * *

హింద్ పిక్చర్స్‌వారి "ఆవారా షాజాదీ"లో శీలారామాని యువరాణిగానూ, నర్తకిగానూ రెండు వేషాలు ధరిస్తోంది. హీరోగా దల్జిత్ నటిస్తున్నాడు. ఇతర నటులు జానీవాకర్, నిమ్మీ, కృష్ణకుమారి, హబీబ్.

* * *

ఎప్పటికప్పుడు క్రొత్త కథలతో చిత్రాలు తీయాలనే ఆశయం కలిగిన డైరెక్టరు, ప్రొడ్యూసరు హోమేన్ గుప్త "టక్‌సాల్" చిత్రాన్ని చాలవరకు ముగించారు. బల్రాజ్ సాహ్నీ, నిరూపరాయ్ ఇందులో నటిస్తున్నారు. ఓంప్రకాష్, నదిరా కూడా నటిస్తున్నారు.

హోమేన్‌గుప్త తీయబోయే మరొకచిత్రం "బస్తీ ఇలాడో" ★

## వివాహ మహోత్సవాలు

విజయ ప్రొడక్షన్స్, చందమామ పబ్లికేషన్స్, బి. ఎన్. కె. ప్రెస్ సంస్థలకు చెందిన బి. నాగిరెడ్డిగారి కుమార్తె చి॥ సౌ॥ జయలక్ష్మిని ఎ. వి. రెడ్డి (కడియం)గారి కుమారుడు చి॥ ఎ. కె. ప్రేమకుమార్‌కు ఇచ్చి, నాగిరెడ్డిగారి కుమారుడు చి॥ బి. ఎల్. ఎన్. ప్రసాద్‌కు ఎ. వి. రెడ్డిగారి కుమార్తె చి॥ సౌ॥ రజనీ సరస్వతిని ఇచ్చి, చక్రపాణిగారి కుమారుడు చి॥ ఎ. తిరుపతిరావుకు ఎన్. సుబ్బారావుగారి కుమార్తె చి॥ సౌ॥ రాధను ఇచ్చి ఏప్రిల్ 25వ తేదీ ఉదయం వివాహ మహోత్సవాలు మహా వైభవంగా జరపబడినవి. వివాహాలు కోసం బాకంలోని చందమామ బిల్డింగ్స్‌లో జరిగి



ప్రకాష్ పిక్చర్స్‌వారి "పట్రాణి" చిత్రం సెట్స్‌మీద వైజయంతిమాల, దర్శక నిర్మాత విజయభట్.

# "రోజులు మారాయి"

## ప్రేక్షకుల అభిప్రాయాలు

రెండో మూడో పాటలు తప్పించి మిగిలిన పాటలన్నీ బాగున్నవి. ముఖ్యంగా ఏరువాక పాట చాల బాగున్నది. తాపీ చాణక్యగారి దర్శకత్వము చాల బాగున్నది.

ప్రేక్షకులకు విసుగు జనించకుండా ముందు ఏమి జరుగుతుందో అని ఆతృత కలుగునంత బిగువుగా కథను నడిపించుకుని వచ్చినారు. మాస్టర్ వేణు సంగీతం చాలా బాగున్నది. కమల్‌ఘోష్ గారి ఫోటోగ్రఫీలో కొత్తదనం ఏమీ కనుపించలేదు.

వేణుగా నాగేశ్వరరావు, రాధగా జానకి నటించి చిత్రానికి వన్నె తెచ్చారు. రమణారెడ్డి, రేలంగి, పేరుమాళ్ళు మొదలైన వారి పటిమ కూడా బాగానే వుంది. సి. యస్. ఆర్. అంజనేయులు విలన్



వల్ల అందరినీ ఎలా ఆకర్షించినది ఇందులో చిత్రించబడింది.

ఇది గాక వైట్ క్రిస్టమస్, ది ఫార్ హొరైజన్స్, టు కాచ్ ఎ థీఫ్, స్ట్రాటెజిక్ కమాండ్, ది ట్రబుల్ విత్ హారీ చిత్రాలలోని కొన్ని దృశ్యాలు కూడా చూపబడినాయి.



పాత్రలకు కూడా పనికివస్తారనిపించుకున్నారు.

వి. వి. ఎస్. శాస్త్రి,
—గుడివాడ.

*   *   *

చిత్రం చాలా పెద్దగా ఉంది. ఇంతకంటె ఒక్క బంజరుభూముల పంపకం విషయం తీసికొని చిత్రం తీసివుంటే నిడివి తగ్గేది. ఇంకా బాగా రాణించేది. ప్రారంభంలో కొంత విసుగు కలిగించినా రెండవభాగంలో చాలా చురుకుగా సాగింది చిత్రం. ఫోటోగ్రఫి బాగుంది. దర్శకులు చాణక్య గారు అభినందనీయులు. సంగీతం అంత బాగాలేదు. వహీదా నృత్యం, పాట బాగున్నాయి. కట్నాల నిర్మూలనం, మొదలైన విషయాలు, ముఖ్యంగా ప్రేమగోష్ఠి అసలు లేకుండా ఉంటే చిత్రం బాగా ఉండేది. ఈ చిత్రం బొంబాయి చిత్రాలకు ఏమాత్రం తీసిపోదు సరిగదా వాటిని తలదన్నిందని చెప్పాలి.

నిత్యానందం
—సికిందరాబాదు.

# గ్రంథ సమీక్ష

(49-వ పేజీ తరువాయి)

మనుష్యులందరూ ఒక్క తీరున మాట్లాడతారు; కొంచెం తేడాగా ఆలోచిస్తారు అందరికీ ఒకేరకం తెలివితేటలుంటాయి. అందరూ కూడబలుక్కున్నట్టు ఒక్కమాదిరిగానే వ్యవహరిస్తారు. ఇందువల్లే కాబోలు ఏ సన్నివేశంలో కాని ఏ పాత్రల చిత్రణలో కాని కుతూహలం కలుగదు. ఉదాత్తమైన రచనావిధానంతో అన్నిటా గడియితే ప్రత్యేకత మాత్రం ఉంటుంది.

వాసిరెడ్డి సీతాదేవిగారి కథానికలలో కొన్నిటిని గమనిస్తే, ఇవి ఆవిడ మాత్రమే వ్రాయగలరనిపించకమానదు. నిజంగా మన రచయితలు తమ అవస్థాదాన్ని గుర్తించుకుని రచనలు చేస్తే బాగుంటుందని తోస్తుంది. బావ, అపస్వరాలు, ధర్మపత్ని గుడికళ్ళు అనే కథలతో ఆడవాళ్ళ పరిస్థితులపట్ల రచయిత్రికిగల జాలి, బాధ వ్యక్తమౌతాయి. ఆడవాళ్ళ ప్రేమానురాగాలనే అందుకుని పటు ఉచ్చులు పన్నే మగవాళ్ళపై తిరగబడిన ఒక స్త్రీ కథ "తిరస్కృతి". ప్రణయజీవితాన్ని తిరస్కరించి నీళ్ళులేని మొక్కలాగా ఆమె వాడిపోతుంది. సీతాదేవిగారు పేదల జీవితాన్ని కూడా చక్కగా చిత్రించగలరు.

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St Madras



లినోకట్ చిత్రం

—జి. వి. సుబ్బారావు

# మా కుమార్తె వివాహమైనప్పుడు...



...పెళ్లి విందుకు వందలాది మంది వచ్చారు! నిజంగా, ఖర్చు విషయం చిక్కే అనిపించింది—డాల్డా వనస్పతి నహకరించేవరకు. డాల్డాతో వంట ఎంతో తక్కువ ఖర్చు—మరియు రుచికరం కూడా! మరియు డాల్డా గాలిచొరని సీలు డబ్బాలలో అమ్మబడుచున్నది గనుక, అది ఎల్లప్పుడు శుద్ధమైనది మరియు ఆరోగ్యకరమైనది అని మీరు విశ్వసింపవచ్చు. ప్రతిరోజూ ఆహారాలకు, లేక ప్రత్యేక సందర్భాలందు, ఎల్లప్పుడు డాల్డాను వాడండి!




పెళ్లి విందుకు మిఠాయిలు తయారు చేయు విషయంలో ఉచిత సలహా కొరకు క్రింది చిరునామాకు వ్రాయండి.
ది డాల్డా అడ్వైసరీ సర్వీస్
ఇండియా హౌస్, (జి.పి.ఓ కి ఎదురుగా) బొంబాయి 1

## డాల్డా వనస్పతి

వంటకు దివ్యమైనది — ఖర్చు తక్కువ

భారతదేశంలో అన్నిచోట్లా ½ పౌను, 1 పౌను; 2 పౌన్లు, 5 పౌన్లు మరియు 10 పౌన్లు డబ్బాలలో దొరకును.

HVM 238-X52 TL